

# హిందూ మతం అంటే ఏమిటి?

మహాత్మా గాంధీ

అనువాదం

ఇలపావులూరి వేంకట సుబ్బారావు

భారతీయ చరిత్ర పరిశోధనా పరిషత్తు తరఫున



నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా

ISBN 81-273-1540-4

ప్రథమ ముద్రణ 1995 (శక 1917)



Hindu Dharam Kya Hai ? (*Telugu*)

రూ. 36.00

డైరెక్టర్ , నేషనల్ బుక్‌ట్రస్ట్, ఇండియా, ఎ5, గ్రీన్ పార్కు,
న్యూ ఢిల్లీ-110 016 ద్వారా భారతీయ చరిత్ర పరిశోధనా పరిషత్తు
తరఫున ప్రచురింపబడినది.

# విషయ సూచిక

# ఆముఖం

మహాత్మా గాంధీ 125వ జన్మదిన సందర్భంలో హిందూ మతాన్ని గురించి ఆయన వ్యక్త పరచిన సమృద్ధ చింతనను పాఠకులకు అందజేయగలుగుతున్నందుకు నాకుచాలా ఆనందంగా ఉంది. ఈ సంకలనం ముఖ్యంగా: యంగ్ ఇండియా,హరిజన్, నవజీవన్‌లో హిందీ, గుజరాతీలలో గాంధీజీ వ్రాసిన వ్యాసాలపై ఆధారపడి ఉంది. ఈ వ్యాసాలు వేరు వేరు సందర్భాలలో వ్రాసినప్పటికీ వీటిలో హిందూ మతాన్ని గురించి ఒక సమగ్రమైన భావనాఛవి కనిపిస్తుంది. భావ పుష్టిలోనూ, సార సంగ్రహణశీలతలోనూ, మానవ జాతి ఉనికికి సంబంధించిన సంకల్ప వికల్పాల సమన్వయంలోనూ ఇలాంటి సంకలనం అన్యత్రా దుర్లభం.

'హిందూ మతం అంటే ఏమిటి?' అనే విషయం మీద గాంధీజీ ఆలోచనాసరళి ఏకాలానికైనా సమకాలికంగానే ఉంటుంది. అయినప్పటికీ ఈనాటి చరిత్ర సంచరణ సందర్భంలో దీనికి ప్రత్యేకమైన ప్రాశస్త్యం ఉంటుందని నా అభిప్రాయం.

ఈ సంకలనాన్ని రూపొందించటంలో నా సహోద్యోగి నెహ్రూ మ్యూజియం డెప్యూటీ డైరెక్టర్ డాక్టర్ హరిదేవ శర్మ నాకు చాలా సహకరించారు. ఈ పుస్తకాన్ని ఇంత స్వల్ప కాలంలో భారతీయ చరిత్ర పరిశోధనా పరిషత్తుకు అందించే బాధ్యత వహించినందుకు నేషనల్ బుక్ ట్రస్ట్‌కు నేను కృతజ్ఞత చెప్పుకుంటున్నాను.

2 అక్టోబరు 1993

రవీంద్ర కుమార్
ఛైయర్‌మన్
భారతీయ చరిత్ర పరిశోధనా పరిషత్తు
కొత్త ఢిల్లీ



# 1

# హిందూ మతం అంటే ఏమిటి?

హిందూ మతం ప్రభుత్వ ప్రోద్బలంతో ప్రసరించిన మతం కాకపోవటం ఒక విధంగా అదృష్టం, మరో విధంగా దురదృష్టం కూడా కావచ్చు. అందుకనే నన్ను అపార్థం చేసుకునే అవకాశం లేకుండా ఉండేందుకు 'సత్యం, అహింస నా మతం' అని నేనన్నాను. ఎవరయినా నన్ను హిందూ మతాన్ని వ్యాఖ్యానించండని అడిగితే నేను చెప్పే సమాధానం ముక్తసరిగా ఇది - అహింసాత్మకమయిన మార్గంలో జరిపే సత్యాన్వేషణ. దైవం పై నమ్మకం ఉన్నా లేకున్నా ఒక వ్యక్తి తాను హిందువునని చెప్పుకో గలడు. నిర్విరామ సత్యాన్వేషణకు మరో పేరు హిందూ మతం. అలాంటిది ఈనాడు నిర్జీవమై నిష్క్రియమై అభ్యుదయాన్ని పొందలేక పోతున్నదంటే దానికి కారణం మనలో ఏర్పడిన అలసత. ఈ అలసత తొలగిపోయిన మరు క్షణంలో హిందూ మతం ఇంతకు ముందు ఎప్పుడూ లేని ప్రఖర దీప్తితో తిరిగి ప్రపంచంలో వ్యాపించ గలదు. కనుకనే హిందూ మతం నిజానికి సహన శక్తిలో సాటి లేని మతం.

---

24.4.1924, పుటలు 516-518,సంపుటం 23. గాంధీ వాఙ్మయం



2

## హిందూ మతంలో భూత కల్పన ఉందా?

నా ఉద్దేశ్యంలో అన్నింటిని సమకూర్చుకుని పోయే సమన్వయ తత్త్వం హిందూ మతంలోని వైశిష్ట్యం. 'మహాభారతం' రచించిన దివ్య ద్రష్ట తన బృహద్రచనను గురించి చెప్పిన విషయం హిందూ మతానికి కూడా పూర్తిగా అన్వయిస్తుంది. హిందూ మతంలో అన్ని మతాల సారం ఉంది. ఇందులో లేనిది సారహీనం కనుక అనవసరం.

---

17.9.1925, పుట 204, సంపుటం 28, గాంధీ వాఙ్మయం



3

# నేను హిందువును ఎందుకని?

భారత దేశంలో తన యావజ్జీవిత మైత్రిని ప్రకటించిన ఒక అమెరికా సోదరి ఇలా వ్రాశారు:

> "హిందూ మతం ప్రాచీన ముఖ్య మతాలలో ఒకటి. మీరు క్రైస్తవ మతాన్నీ, హిందూ మతాన్నీ అవగాహనం చేసుకున్నారు. ఈ అవగాహనను పురస్కరించుకునే మీరు 'నేను హిందూ మతావలంబి' నని చెప్పుకున్నారు. మీ అభి మతానికి కారణం మిమ్మల్ని అడిగి తెలుసుకునేందుకు నేను మీ అనుమతి కోరుతున్నాను. భగవత్ తత్వాన్ని తెలుసుకుని నిజమైన మనసుతో భగవదారాధన చెయ్యటమే హిందువులూ క్రైస్తవులు అభిలషించే ఆదర్శం. ఏసుక్రీస్తు భగవంతునికి ప్రతినిధి అనే నమ్మకంతోనే, అమెరికాలో నిక్రైస్తవులు తమ వేల కొలది బిడ్డలను ఏసుక్రీస్తును గురించి భారతీయులకు చెప్పేందుకు పంపించారు. క్రీస్తు బోధించిన విషయాలతో పాటు హిందూ మతాన్ని తులనాత్మకంగా పరిశీలించి హిందూ మతానికి మీదయిన ఒక అభిమతం దయచేసి మాకు చెప్పగలరా? మీరు చేసే యీ ఉపకారానికి నేను హృదయపూర్వకంగా కృతజ్ఞత చెప్పుకుంటాను."

అనేక క్రైస్తవ మహా సభల్లో ఆంగ్లేయులకూ, అమెరికా మిషనరీలకు నేను నిర్భయంగా నా అభిప్రాయం వివరిస్తూ ఇలా చెప్పేను. మీరు క్రీస్తును గురించి భారతీయులకు చెప్పటం మాని 'సర్మన్ ఆన్ ద మౌంట్' లో చెప్పబడిన ప్రకారం జీవితంలో మీ ఆచరణ సాగించగలిగితే భారతీయులకు మీ పయి అనుమానం అంతరించి మీ పట్ల గౌరవం

---

20.10.1927, పుటలు 170-171, సంపుటం 35, గాంధీ వాఙ్మయం

పెరుగుతుంది. మీ వల్ల చాలా విషయాలు తెలుసుకుంటారు. మీతోపాటు సహజీవనాన్ని కోరుకుంటారు. నాకు గల యీ అభిప్రాయం వల్ల నేను అమెరికా మిత్రులకు హిందూ మతాన్ని గురించి, 'ప్రతివాదం' గా నేనేమీ 'పలుక' లేదు. తన మతాన్ని గురించి, ముఖ్యంగా మత పరివర్తనను గురించి ఇతరులకు చెప్పటంలో నాకు నమ్మకం లేదు. నమ్మకం గలవాడికి తన నమ్మకాలను గురించి ఇతరులకు చెప్పవలసిన అవసరం లేదు. తన నమ్మకాన్ని బట్టి తన ఆచరణను రూపొందించు కొనగలిగితే చాలు. ఆచరణ బలంతోనే ఆచారాలు ప్రచారంలోకి వస్తాయి.

నా జీవిత విధానమే హిందూ మతానికి నేను చేయ గలిగిన వ్యాఖ్య. మరో విధంగా ఈ పని నేను చేయ గలనని నేననుకోలేను. హిందూ మతాన్ని గురించి లిఖిత పూర్వకంగా నేను వివరించ లేనప్పుడు క్రైస్తవ మతంతో దాన్ని పోల్చి చెప్పగల ప్రసక్తే లేదు. కాబట్టి 'నేను హిందువుని ఎందుకని'-అనే విషయాన్ని సాధ్యమైనంతవరకు ముక్తసరిగా చెప్పేందుకు మాత్రం ప్రయత్నిస్తాను.

వంశానుక్రమంగా సంక్రమించే గుణగణాల ప్రభావాన్ని నేను నమ్ముతాను. హైందవ కుటుంబంలో నేను జన్మించాను. కాబట్టి నేను హిందువును. దీనివల్ల నా నైతిక పరిజ్ఞానానికి గానీ, ఆధ్యాత్మిక వికాసానికి గాని అంతరాయం ఏర్పడితే దీన్ని నేను పరిత్యజిస్తాను. నేను స్వాధ్యాయం వల్ల అర్థం చేసుకున్న మతాలన్నిటిలో ఎక్కువ సహనం గల మతం ఇదే అని నాకనిపించింది. తాను చెప్పిన సిద్ధాంతమే సరియైనదనే మొండి పట్టు ఈ మతంలో లేదు. ఆ విషయం నాకు చాలా బాగా నచ్చింది. అందువల్ల ఈ మతాన్ని అనుసరించే వాళ్ళకు ఆత్మాభివ్యక్తికి ఎక్కువ అవకాశం ఉంటుంది. హిందూ మతం నిషేధాత్మకమయిన మతం కాదు. అందువల్ల హిందూ మతస్థులు ఇతర మతాలను గౌరవించటమే కాక అన్ని మతాలలోని మంచిని గ్రహించి ఆమోదించి అవలంబించ గలరు. అహింస అన్ని మతాలలో ఉంది. కాని హిందూ మతంలో దానిని గురించిన ప్రసక్తి పరిశోధనలు అత్యున్నత స్థాయిలో జరిగాయి. (జైన, బౌద్ధమతాలను నేను హిందూ మతానికిభిన్నంగా భావించటం లేదు). హిందూ మతం సర్వ మానవ సమానత్వాన్నే కాక సకల జీవకోటి సమైక్యాన్ని కూడా విశ్వసిస్తుంది. నా దృష్టిలో హిందూ మతంలోని గో పూజ మానవతా వికాస మార్గంలో ఒక విలక్షణమైన సోపానం. సమస్త జీవరాశిలో ఒకే ఆత్మ తత్త్వం ఉందనీ, అందుకనే ఏ రూపంలో ఉన్నా జీవితమంతా పవిత్రమేననే విశ్వాసానికి ఇది వ్యావహారిక

రూపం. వేరువేరు యోనులలో జీవులు జన్మిస్తారనే నమ్మకం కూడా ఈ నమ్మకం వల్ల ఏర్పడ్డ సహజ పరిణామమే. చివరకు వర్ణాశ్రమ ధర్మానికి సంబంధించిన సిద్ధాంత పరిశోధన కూడా నిరంతర సత్యాన్వేషణనుంచి ఉదయించిన చక్కని పరిణామమే. పైన చెప్పిన విషయాలను నిర్వచించి నేనీ వ్యాసాన్ని పొడిగించదలచుకో లేదు. ఈ నాడు గో భక్తిని గురించీ వర్ణాశ్రమ ధర్మాలను గురించీ ప్రజలలో ఉన్న అభిప్రాయాలు వీటిని గురించిన యదార్థాలకు విపరీతార్థాలకు మాత్రమే అన్న నా అభిప్రాయాన్ని వ్యక్త పరచటమే నా అభీష్టం. కావలిస్తే 'యంగ్ ఇండియా' వెనకటి సంపుటాల్లో వర్ణాశ్రమానికీ, గో భక్తికీ ఇచ్చిన నిర్వచనాలను చూడవచ్చు. కొద్ది రోజుల్లో నేను వర్ణాశ్రమాన్ని గురించి కొంత చెప్ప గలననుకుంటాను. ఈ సంక్షిప్త సారాంశ వివరణలో కేవలం నన్ను హిందువుగా నిలబెట్టిన హిందూ మత తత్వాన్ని మాత్రం చెప్పాను.

[ఆంగ్లం నుండి]
యంగ్ ఇండియా, 20.10.1927



4

# హిందూ మతం

నా మద్రాసు పర్యటనలో ప్రసంగిస్తూ నేను సనాతన హిందువునన్న విషయం ఎంత పటిష్ఠంగానో చెప్పాను. అంత గట్టిగా నా హిందుత్వాన్ని గురించి నేనెప్పుడూ చెప్పుకోలేదు. అయినా, హిందూ మతం పేరిట చేసే చాలా పనులునాకు సమ్మతం కానివి ఉన్నాయి. నిజంగా నేను అలాంటి వాడిని కాకుంటే సనాతన హిందువునని కానీ మరో విధమైన హిందువునని కానీ చెప్పుకోవాలనే అభిలాష నాకు ఏమీ లేదు. ఒక మహనీయమైన మతాన్ని మాటు పెట్టుకొని సంస్కార కార్యక్రమాన్ని కావి మరో దుష్కార్యాన్ని కావి ప్రవేశ పెట్టాలనే సంకల్పం నాకు ఏమాత్రం లేదు.

అందుకని సనాతన మతాన్ని నేను ఎలా అర్థం చేసుకున్నానో ఒకసారి తుది మాటగా స్పష్టీకరించటం అవసరం. సనాతన శబ్దాన్ని నేను సహజంగా వాడుకలో ఉన్న అర్థంలోనే వ్యవహరిస్తున్నాను.

నేను సనాతన హిందువునని నేను ఎందుకు చెప్పుకుంటున్నానంటే:

1. వేదాలలో, ఉపనిషత్తులలో, పురాణాలలో, హిందూ మత గ్రంథాలలో ప్రతిపాదింపబడిన సమస్త వాఙ్మయాన్ని-అందుకనే అవతార పునర్జన్మ సిద్ధాంతాలను కూడా నేను నమ్ముతాను.

2. వర్ణాశ్రమ ధర్మాన్ని విశుద్ధమయిన వైదిక పరిభాషలో నేను నమ్ముతాను. ఈనాడు లోకాచారంలో కనిపించే స్థూల స్వరూపం మీద నాకు నమ్మకం లేదు.

3. గో సంవర్ధన కార్యక్రమాన్ని లోకాచారం కంటే అత్యంత విశాలమైన రూపంలో నేను నమ్ముతాను.

---

6.10.1921. పుటలు 260-261. సంపుటం 21. గాంధీ వాఙ్మయం

4. విగ్రహారాధనపై నాకు నమ్మకం లేకపోలేదు.

వేదాలను గురించి చెబుతూ అవి అపౌరుషేయాలని కానీ, దైవ వాక్కులని గానీ చెప్పలేదు. కావాలని అలాంటి విశేషణాలను నేను వాడలేదు. కారణం నా దృష్టిలో కేవలం వేదాలు మాత్రమే అపౌరుషేయాలు. దైవ వాక్కులు కావు. బైబిల్, కురాన్, జంద్ అవెస్తా లాంటి గ్రంధాలలో కూడా అలాంటి దైవ ప్రేరణ కనిపిస్తుంది. అంతే కాదు. హిందూ మత గ్రంధాలపై నాకున్న నమ్మకం వాటిలోని ప్రతి శబ్దం, ప్రతి వాక్యం దైవ ప్రేరితమని నేను అంగీకరించేందుకు సమ్మతించదు. ఈ అమూల్య గ్రంధాలను నేను మూల విధేయంగా అధ్యయనం చేశానని నేను సాధికారంగా చెప్పలేను. కానీ వాటిలో బోధింపబడిన తాత్విక సత్యాన్ని నేను అవగాహనం చేసుకొని అనుభూతికి తెచ్చుకోగలిగానని మాత్రం చెప్పగలను. ఈ గ్రంధాలకు ఎంత పాండిత్యంతో వ్యాఖ్యానాలు వ్రాసినా అవి నా వివేకానికీ, నైతిక బుద్ధికీ రుచించకపోతే నేను అలాంటి వ్యాఖ్యానాలకు కట్టుబడి ఉండేందుకు సిద్ధ పడలేను. ఈ నాడు శంకరాచార్యులూ, శాస్త్రవేత్తలూ ఈ గ్రంధాలకు మేము సరియైన వ్యాఖ్యానం చెబుతున్నామని వక్కాణిస్తే (అలా జరిగితే) నేను దానిని నిక్కచ్చిగా నిరాకరిస్తాను. నిజానికి ఈ నాడు ఈ వాఙ్మయాన్ని గురించిన మన పరిజ్ఞానం చాలా అస్తవ్యస్తంగా ఉంది. అహింస, సత్యం, బ్రహ్మచర్యంలాంటి గుణగణాలను సాధించలేని వాళ్ళూ, ధనలాలసను పరిత్యజించలేని వాళ్ళూ, సంపదమీద వ్యామోహాన్ని విసర్జించ లేనివాళ్ళూ నిజానికి ఈ శాస్త్రాలలోని రహస్యాలను బోధపరచుకోలేరని ఘోషించే హిందూ మత సిద్ధాంత సూత్రం మీద నాకు పూర్తిగా నమ్మకం ఉంది. నాకు గురువు మీద నమ్మకం ఉంది. కానీ ఈ యుగంలో లక్షలాది కోటికోటి ప్రజానీకానికి గురువు లేకుండానే కాలక్షేపం చెయ్యాల్సి ఉంటుంది. కారణం, పరిపూర్ణమైన పవిత్రత, జ్ఞానం ఒకే వ్యక్తిలో కూడి ఉండటం ఈనాడు చాలా దుర్లభమయిపోయింది. కానీ అంత మాత్రాన మనం మః మతంలోని పరమ సత్యాన్ని గ్రహించలేమని నిరాశ చెందనవసరం లేదు. ఎందుకంటే ఇతర మతాల్లోలాగే హిందూ మతంలోని ప్రాతిపదిక సిద్ధాంతాలు సనాతన మయినవి. వీటిని అవలీలగా అర్థం చేసుకో వచ్చు. ప్రతి హిందువూ భగవంతుడు అద్వితీయుడు అని నమ్ముతాడు. పునర్జన్మ, మోక్షం ఉన్నాయని అంగీకరిస్తాడు.

నా భార్యను గురించి నా అంతరంగాన్ని వ్యక్తం చేయటం నాకు ఎంత కష్ట సాధ్యమో హిందూ మతాన్ని గురించి నా అభిమతం

తెలియపరచటం కూడా అంతే. నా భార్య నన్ను ఎంత ఆకట్టు కోగలుగుతుందో ప్రపంచంలో మరి ఏ స్త్రీ కూడా నన్ను అంతగా రంజింపలేదు. ఆమెలో లోపాలు లేనేలేవని కాదు. నన్నడిగితే ఆమెలో నాకు కనిపించే లోపాలకంటే ఎక్కువ లోపాలే ఉండవచ్చు. కానీ ఆమెకు నాతో ఒక అవిచ్ఛిన్నమయిన అనుబంధం ఉంది. అది నా అనుభూతిలో ఒక భాగం. హిందూ మతాన్ని గురించి కూడా నా భావానుబంధం అలాంటిదే-దానిలో ఎన్ని లోపాలున్నా సరే, ఎన్ని పరిమితులున్నా సరే, హిందూ మతానికి సంబంధించిన రెండు గ్రంథాలు నాకు బాగా తెలుసని గర్వంతో చెప్పుకోగలను. ఒకటి 'గీత', రెండవది 'తులసీ రామాయణం.' ఈ రెండు గ్రంథాలలోని భావ లహరి నన్ను ఆహ్లాద పరచినంతగా మరేదీ నన్ను మురిపించ లేదు. ఒకసారి నా జీవితంలో తుదిక్షణం నన్ను సమీపిస్తున్నదని అనిపించినప్పుడు 'గీత' వల్లనే నాకు ఓదార్పు లభించింది. ఈనాడు పేరు పొందిన హిందూ ఆలయాలలో జరుగుతున్న దురాచారాలు నాకు తెలుసు. ఆ లోపాలను చెప్పేందుకు కూడా నోరు రాదు. అయినా నాకు దేవాలయమంటే ప్రేమ. ఆలయమనగానే ఏదో ఒక విధమయిన ఆకర్షణ నన్ను చేరదీస్తుంది. మరేదీ కూడా నన్ను అలా ఆకర్షించలేదు. నేను ఆద్యంతం సంస్క రణవాదిని. కానీ నేను ఉత్సాహాతిరేకంలో నేను హిందూ మతంలోని సారభూత తత్త్వాన్ని విసర్జించలేను. విగ్రహారాధనపై నాకు నమ్మకం లేకపోలేదని నేను చెప్పాను. ఏ విగ్రహాన్ని చూచినా నామనస్సులో శ్రద్ధాభావం ఉదయించదు. కానీ విగ్రహారాధన మానవ నైజంలో ఒక భాగమని నా అభిప్రాయం. ప్రతిమలన్నా, ప్రతీకాలన్నా మనకు సహజంగా ఆకర్షణ ఉంటుంది. లేకుంటే మిగిలిన స్థలాలకంటే చర్చికి వెళ్ళగానే మనలో ఒక విధమైన గాంభీర్యం ఎందుకు ఏర్పడుతుంది? ప్రతిమలు పూజకు దోహదం చేస్తాయి. ఏ హిందువు కూడా విగ్రహాన్ని భగవంతుడని భావించడు. నేను విగ్రహారాధనను పాపంగా భావించను.

పైన చెప్పిన దానిని బట్టి హిందూ మతం నిషేధాత్మకమైన మతం కాదని స్పష్టమవుతుంది. ప్రపంచంలోని మత గురువులనందరినీ ప్రవ క్తలందరినీ పూజించేందుకు అందులో స్థానముంది. సామాన్య పరిభాషలో అది ప్రచారం కోసం ప్రయత్నించే మతం కాదు. దాని ఛాయలో అనేక జాతులు సమ్మిళితమై ఉన్నాయి. కాని అది వికాసానికి దోహదం చేసే సహజ సంఘటనగా కనిపించకుండా రూపొందిన ప్రక్రియ. హిందూ మతం అన్ని మతాలవాళ్ళనూ తమ తమ మతాలననుసరించి

ఈశ్వరారాధన చేయ వచ్చునని బోధిస్తుంది. అందు వల్లనే ఏ మతంతో కూడా దానికి విరోధం లేదు.

హిందూ మతాన్ని గురించి నా అభిప్రాయం ఇది. అందు వల్లనే అంటరాని తనాన్ని అంగీకరించేందుకు నేను నా అంతరంగాన్ని ఎన్నడూ సంసిద్ధం చేయలేక పోయాను. హిందూ మతంలో ఇది గొప్ప లోపమని నేను నిరంతరం భావించాను. ఈ లోపం మనలో పారంపరికంగా వస్తూ ఉంది. కాని ఈ విషయం ఇలాంటి అనేక దురాచారాలకు కూడా వర్తిస్తుంది. ఆడ పిల్లలను దాదాపు వేశ్యావృత్తిలాంటి దాస్యానికి సమర్పించటం హిందూ మతంలో ఒక భాగమయింది. ఈ మాట తలచుకుంటేనే నాకు సిగ్గు వేస్తుంది. ఈ ఆచారం భారత దేశంలో చాలా చోట్ల ఇంకా సాగుతూనే ఉంది. కాళి ఎదుట మేకలను బలి ఇవ్వటం హిందూ మతంలో ఒక భాగమని నేననుకోను. హిందూ మతం అనేక యుగాల వికాస పరిణామం. హిందూస్థానీయుల మతానికి హిందూ మతమనే పేరు విదేశీయులు పెట్టారు. ఒకానొక సమయంలో మతం పేరిట పశు బలి ఇవ్వటం ఆచారం అనే విషయంలో సందేహం లేదు. కాని అది ఏ మతమూ కాదు. అలాగే గో సంవర్ధన హిందువుల మత సమ్మతమయినప్పుడు గో మాంసం తినే వాళ్ళను సంఘంనుంచి బహిష్కరించి ఉంటారని నా అభిప్రాయం. అందువల్ల సంఘంలో ఘోరమయిన సంఘర్షణ జరిగి ఉంటుంది. ఈ సాంఘిక బహిష్కరణ ఈ మత నిబంధనను నిరాకరించినవాళ్ళ వరకే పరిమితం కాకుండా ఈ పాపానికి ఫలితం వాళ్ళ సంతతికి కూడా సంక్రమించింది. ప్రారంభంలో సదుద్దేశ్యంతో ప్రవేశ పెట్టిన ఆచారం తర్వాత తర్వాత కఠోరమైన అత్యాచారంగా పరిణమించింది. మత సంహితల్లో దీనికి సంబంధించిన శ్లోకాలు కూడా కొన్ని చేర్చారు. దానితో ఈ సంప్రదాయం అనుచిత రీతిలో అన్యాయకరంగా చిరస్థాయిగా నిలిచిపోయింది. నా అంచనా నిజం కావచ్చు, కాకపోవచ్చు. కాని అంటరానితనం బౌద్ధికతకూ, కరుణ, దయ, ప్రేమలాంటి సద్గుణాలకూ విరుద్ధమయిందని నా అభిప్రాయం. గోపూజను ప్రవేశపెట్టిన మతం నిర్దయతో నిర్మానుష్యంగా మనుష్య జాతిని ఎలా బహిష్కరించగలదు? నన్ను ముక్కలు ముక్కలుగా నరికినా సరే దళితులను వదలి నేను వేరుగా ఉండలేను. హిందువులు తమ మహోన్నత మతాన్ని అంటరాని తనంతో అపవిత్రంగా ఉంచినంత కాలం వాళ్ళు స్వాతంత్ర్యానికి ఏమాత్రం అర్హులు కానే కారు. స్వాతంత్ర్యాన్ని సాధించలేరు కూడా. హిందూ మతం నాకు నా ప్రాణం

కంటే ప్రియతరమయినది. అందుకనే అంటరానితనాన్ని సహించటం నాకు అసంభవమైపోయినది. మన జాతిలో ఐదో భాగాన్ని పంచుకున్న వాళ్ళను మనతో సరి సమానంగా కలిసి మెలిసి తిరిగే అధికారానికి నోచుకోని వాళ్ళను చేస్తున్నామంటే మనకు భగవంతుడి మీద నమ్మకం లేదనే దానికి అర్థం.

[ఆంగ్లం నుండి]
యంగ్ ఇండియా, 6.10.1921



5

# సనాతన హిందువు

రహదారినే సరిదారి అనుకుని ఆలోచించకుండా దాన్నే అనుసరించే అవివేకిని కాదు నేను. అందుకనే ప్రపంచంలో వేరువేరు మతగ్రంధాలలోని భావాన్ని గ్రహించేందుకు నేను ప్రయత్నిస్తూ ఉంటాను. సత్యం, అహింస- అనే గీటు రాళ్ళపై వాటిని పరిశీలించి చూస్తాను. ఆ గీటు రాళ్ళు ఆ గ్రంధాల్లోనే నిర్ధారణ చేయబడి ఉన్నాయి. ఈ నికషకు నిగ్గిన వాటిని నేను స్వీకరిస్తాను. అలా నిగ్గని వాటిని నిరాకరిస్తాను. వేదాలు చదివేందుకు సాహసించాడని ఒక శూద్రుణ్ణి రాముడు దండించాడన్న ఉదంతాన్ని నేను ప్రక్షిప్తంగా భావించి నిరాకరిస్తాను. ఏది ఏమయినా నేను ఉపాసించే రాముడు నా రూప కల్పనలో ఒక పరిపూర్ణ పురుషుడు. చారిత్రక పరిశోధనల పురోగతితో పాటు మార్పు చెందే చారిత్రక రాముణ్ణి నేను ఉపాసించను. ఈ చారిత్రక రాముడితో తులసీ దాసుకు ఏమీ సంబంధం లేదు. చరిత్రను ఒరిపిడి రాయిగా చేసుకుని పరిశీలిస్తే అయన రచించిన రామాయణం ఎందుకూ పనికిరాని చెత్త కుప్పలో చేరిపోతుంది. కాని ఆధ్యాత్మికమైన అనుభూతిని ఆణి ముత్యాలుగా అందించే అనర్ఘ రచనగా ఆకృతి అద్వితీయమైనది. కనీసం నాకు మాత్రం అది అలాంటిది. అయినా తులసీ రామాయణం పేరిట వెలువడుతున్న అనేక రచనలలోని ప్రతి పదాన్ని నేను ప్రశస్తమని భావించను. రచనలోని భావ సంపద నన్ను మంత్ర ముగ్ధుణ్ణి చేస్తుంది. శూద్రుల వేదాధ్యయనంపై విధింప బడిన ఆంక్షను నేను అంగీకరించలేను. మనం బానిసలంగా ఉన్నంత వరకూ మనం అందరం నిజానికి శూద్రులమేనని నా అభిప్రాయం. జ్ఞానంపై ఏ శ్రేణికీ వర్గానికీ ప్రత్యేకమైన అధికారం ఉండేందుకు వీలు లేదు.

---

27.8.1925, పుట 116, సంపుటం 28, గాంధీ వాఙ్మయం

ఒక విషయం మాత్రం ఒప్పుకుంటాను. ముందు తయారీ లేకుండా ఉన్నత వాయు మండలంలో ప్రవేశిస్తే అక్కడ ఒత్తిడి తక్కువ కావడం వల్ల ఊపిరి పీల్చడం కష్టమవుతుంది. సాధారణ గణితం అభ్యసించనిదే క్షేత్ర గణితం గాని బీజ గణితం గాని బోధ పడదు. అలాగే ఆధ్యాత్మిక రంగంలో కూడా ప్రాథమిక శిక్షణ లేకుండా ప్రగాఢమైన, గూఢమైన సత్యాలను గ్రహించటం సాధ్యం కాదు. ముగింపు మాటగా నాకు మంచిని పెంచే కొన్ని ఆచారాలమీద గల నమ్మకాన్ని గురించి చెప్పాలి. గాయత్రీ జపాన్ని గురించి కూడా ఒక ఆచారం ఉంది. శాస్త్రీయంగా స్నానాదులు చేసిన తర్వాత నియమిత సమయంలోనే గాయత్రీ జపం చేయాలి. నాకు పూర్వాచారాల మీద నమ్మకం ఉంది. కాని సర్వ కాలాలలో వాటిని పాటించలేకపోతాను. అందు వల్ల చాలా సంవత్సరాల నుంచి తర్వాత కాలపు సాధువులను అనుసరిస్తూ వచ్చాను. శ్రీమద్భాగవతంలోని ద్వాదశాక్షరిని జపించటంతోనో, తులసీ దాసు చూపిన సుగమతర విధానాన్ని అనుసరించడంతోనో లేక గీతలాంటి గ్రంథాలలోని కొన్ని శ్లోకాలను పారాయణం చేయటంతోనో లేదా దేశ భాషల్లోని భక్తి గేయాలను పాడుకొనటంతోనో మనస్సును తృప్తి పరచుకుంటూ వచ్చాను. అవి నాకు అనుదిన ఆధ్యాత్మిక ఆహారాలు. ఇవే నాకు 'గీత' లు. నాకు నిత్యం కావలసిన శాంతి, ఆత్మ సంతుష్టి వీటి వల్ల సమగ్రంగా లభిస్తాయి.



6

# మాలా? రాట్నమా?

ఎక్కడ చూచినా నాకు రాట్నమే రాట్నం కనిపిస్తుంది. ఎందుకంటే నాకు అంతటా పేదరికమే కనిపిస్తుంది. హిందూ దేశంలో అస్థిపంజరం మాత్రం మిగిలిన నిరు పేదలకు అన్న వస్త్రాలు లభించనంతవరకూ వాళ్ళకు ప్రపంచంలో మతం అనేది లేనే లేదు. వాళ్ళు పశువుల్లా జీవితం గడుపుతున్నారు. దీనికి మనం కూడా భాగధేయులమే. దీనికి దోష పరిహారమే మన రాట్నం. వికలాంగులకు సేవ చేయటమే మత ధర్మం. భగవంతుడు మనకు వికలాంగుల రూపంలో సాక్షాత్కరిస్తాడు. నిత్యం మనం తిలకం దిద్దుకుని తిరుగుతూ వాళ్ళనూ, భగవంతుణ్ణీ పరిహసిస్తున్నాము. భగవంతుడు వేదాలలో ఉండవచ్చు, లేకపోవచ్చు. వేదాలను సరి సూటిగా అర్థం చేసుకునే వాళ్ళకు వాటిలో భగవంతుని వెలుగు కనిపిస్తుంది. అలా కాక వేదాల పద జాలంలో ఇరుక్కుని పోయిన వాళ్ళను మనం ఛాందసులు లేక వేదజడులంటాం. అన్నట్టు నరసింహ మెహతా మాల మహాత్మ్యం కీర్తించిన మాట నిజమే. ఆ సందర్భంలో అది సమంజసమే. ఆ మెహతా శిరోమణి నోటనే మరో పాటలో ఇలా అన్నారు:

శుం థయుం తిలక్‌నే తులసీ ధార్యా థకీ,
శుం థయుం మాల గ్రహీ నామ్ లీధే?
శుం థయుం వేద వ్యాకరణ్ వాణీ వద్యే,
శుం థయుం వరణనా భేద్ జాణ్యే?

మహమ్మదీయులు 'తస్‌బీహ్'నూ, క్రైస్తవులు 'రోజరీ' ని బీరుపోకుండా త్రిప్పుతూ ఉంటారు. కాని ఎవరినయినా పాము కరిస్తే

14.8.1924, పుటలు 552-555, సంపుటం 24, గాంధీ వాఙ్మయం

వాళ్ళు 'తస్బీహ్' నూ, 'రోజరీ' నీ వదిలివేసి వాళ్ళకు సాయం చేసేందుకు వెళ్ళకపోతే వాళ్ళు తాము ధర్మ (మత) భ్రష్టులమని భావిస్తారు. బ్రాహ్మణులు వేదాధ్యయనం చేసినంత మాత్రాన మత గురువులు కానేరరు. అలా అయితే మ్యాక్స్‌ముల్లర్ లాంటి వేద విదులు మనకు మత గురువులు అయ్యేవారు. ఈ నాటి యుగ ధర్మాన్ని గుర్తించిన బ్రాహ్మణుడు వేదాధ్యయనానికి ప్రథమ స్థానం ఇవ్వకుండా రాట్నా వేదాన్ని (చర్ఖా ధర్మాన్ని) ప్రచారం చేస్తాడు. కోట్ల కొలది క్షుధాపీడితుల ఆకలి తీర్చిన తర్వాతనే స్వాధ్యాయం సాగిస్తాడు.

రాట్నం నడిపించటాన్ని నేను సంప్రదాయ ధర్మాలకన్నింటికీ మిన్నగా భావించాను. అంటే సంప్రదాయాన్ని వదిలి పెట్టమని కాదు. ప్రతి సంప్రదాయానికీ ప్రతి మతానికీ (ధర్మానికీ) అనివార్యమైన ధర్మాన్ని పాలించడం అన్ని సంప్రదాయాలకంటే అన్ని మతాలకంటే శ్రేష్ఠమయిన ధర్మమే అవుతుంది. అందుకనే సేవాభావంతో రాట్నం త్రిప్పే ప్రతి బ్రాహ్మణుడూ చాలా మంచి బ్రాహ్మణుడనీ, అలాంటి మహమ్మదీయుడు చాలా మంచి మహమ్మదీయుడనీ, అలాంటి వైష్ణవుడు చాలా మంచి వైష్ణవుడనీ నేనంటాను.

కాని నా మనస్సు పూర్తిగా ఏకాగ్రమైన సమయంలో మాల నాకు అవరోధం అనిపిస్తే దాన్ని వదిలేస్తాను. నిద్రపోతూనే రాట్నం త్రిప్పటం నాకు సాధ్యమైతే రామ నామం జపించేందుకు నాకు రాట్నం సహాయం అవసరమనిపిస్తే తప్పకుండా మాలకు బదులు రాట్నాన్నే ఉపయోగిస్తాను. మాలా, రాట్నం రెండింటినీ నడిపించగల సామర్థ్యం నాకుంటే ఆ రెంటిలో ఏదో ఒకటి ఎన్నుకోవలసి ఉంటే దేశం దారిద్ర్యం, నిరాహార మరణాలతో బాధ పడుతున్నంత వరకూ నేను రాట్నమనే మాలను ఉపయోగించేందుకే ఇష్టపడుతాను. రామ నామం జపించటం కేవలం ఉపాధి మాత్రం అనిపించే సమయం కోసం నేను ఎదురు చూస్తున్నాను. రాముడు వాక్కుకు అతీతమైనవాడని భావించగలిగినప్పుడు 'నామ' జపం యొక్క అవసరమే ఉండదు. రాట్నం, మాల, రామ నామం-నా దృష్టిలో వేరు వేరు పదార్థాలు కావు. నా మట్టుకు నాకు ఈ మూడూ సేవా ధర్మాన్ని బోధిస్తాయి. సేవా ధర్మాన్ని పాటించకుండా నేను అహింసా ధర్మాన్ని పాటించలేను. అహింసా ధర్మాన్ని అనుసరించకుండా సత్యాన్ని అన్వేషించలేను. సత్యానికి మించిన ధర్మం లేదు. సత్యమే రాముడు, నారాయణుడు, ఈశ్వరుడు, ఖుదా, అల్లా, గాడ్.



7

# అంటరానితనం

మతం పేరిట మనం హిందువులం బాహ్య పటాటోపం చాలా అట్టహాసంతో సృష్టించుకున్నాము. మతాన్ని కేవలం తినటం త్రాగటంలాంటి అప్రధానమైన అంశాలకు పరిమితం చేసి ప్రతిష్ఠను తగ్గించేసాము. బ్రాహ్మణత్వానికి అప్రతిమస్థానం లభించటానికి కారణమైన జ్ఞాన ప్రదీప్తమైన నిఃస్పృహత, అంతఃకరణ శుద్ధి, ఘోర తపస్సు - హిందువులు అన్న పానాలకు అంటరానితనం వంటి విషయాలకు ఆధ్యాత్మికంగా అత్యధిక ప్రాధాన్యత ఇస్తే దాని వలన వచ్చే దుష్ఫలితాలను అనుభవించక తప్పదు. మనం అంతఃకరణ పవిత్రత గురించి ఎక్కువ ఆలోచించాలి. మన లోపల చాలా దురాలోచనలు చోటు చేసుకుని ఉన్నాయి. ఘోరాతి ఘోరమైన పాప పూరిత దురాలోచనలు మనలను స్పృశిస్తున్నాయి, అపవిత్రుల్ని చేస్తున్నాయి. ఈ పరిస్థితిలో మన పవిత్రత చూసుకుని గర్వంతో విర్రవీగుతూ అజ్ఞానం వల్ల మన సోదరులను చిన్న చూపుతో చూస్తూ వాళ్ళకంటే మనం మిన్న అనుకుని వాళ్ళను స్పృశించటం దోషమని భావించి నువ్వు గింజను తాళవృంతం చేయటం సబబు కాదు. సర్వ శక్తిమంతుడైన పరమాత్మ దగ్గర మన పరిచయం చేసుకునేది మనం ఎలాంటి ఆహారం తిన్నాము, ఏమి త్రాగాము, ఎవరెవరిని తాకాము అనేది కాదు. మనం చెప్పుకో గలిగేది మనం ఎవరెవరి సేవ ఎలా చేశాము అని. మనం అష్టకష్టాల్లో ఉన్న వ్యక్తికి సహాయం చేస్తే అతను తప్పనిసరిగా మనల్ని కృపా దృష్టితో చూస్తాడు. ఎలాగైతే చెడ్డ మనుష్యులకు, చెడు ఆలోచనలకు దూరంగా ఉండాలో అలాగే

---

5.1.1992, పుటలు 144-145, సంపుటం 22, వాఙ్మయం

చెడిపోయిన, ఉత్తేజకరమైన భోజనపదార్థాలకు కూడా దూరంగా ఉండాలి. కాని ఈ విషయాలకు నియమాలకు అత్యధికమైన ప్రాధాన్యం ఇవ్వకూడదు. మనం భోజనంలో కొన్ని పదార్థాలను తినకపోవటం మన మనస్సులోని కపటత్వం, పొగరు, పాప భూయిష్ఠమైన ఆచరణను కప్పి పుచ్చటానికి వాడుకోకూడదు. పతితులను, అశుభ్రంగా ఉన్న మన సోదరీమణులను మన ఆధ్యాత్మిక సాధనకు అవరోధమని వాళ్ళ సేవ చేయటం ఎప్పుడూ ఆపివేయకూడదు.



8

# నా జీవిత కర్తవ్యం

నన్ను మహాత్ముల కోటికి చెందిన వాడని చెప్పటం నేను ఒప్పుకోను. ఎందుకంటే ఆ యోగ్యత నాలో ఉందని నేను నమ్మను. నేను కేవలం ఒక సత్య సంధుడిని. ఈ జన్మలోనే ఆత్మ సాక్షాత్కారాన్నీ, మోక్షాన్నీ ఆకాంక్షించే వాడిని. నేను చేస్తున్న దేశ సేవ కూడా ఆ సాధనలోని భాగమే. దీని ద్వారా ఈ పాంచభౌతిక కాయం నుంచి ఆత్మను విడి చేసి ముక్తిని సాధించాలని నా ప్రయత్నం. ఈ దృష్టితో చూచినట్లయితే నా దేశ సేవ స్వార్థపూరిత సాధన అని అనుకోవచ్చు. నాకు ఈ నశ్వరమైన ఐహిక రాజ్య సంపద మీద వ్యామోహం ఏమీ లేదు. నా ప్రయత్నం అంతా కూడా ఈశ్వరీయ రాజ్యం, మోక్షం సంపాదించటమే. ఈ ప్రయత్నంలో నాకు ఏ గుహలోనో వెళ్ళి కూర్చోవలసిన అవసరం లేదు. గుహను నాతోటి ఎప్పుడూ తీసికొని వెళ్ళుతూ ఉంటాను. కేవలం అనుభూతి మాత్రమే అయినా గుహలో ఉండే సాధకుడు మనస్సులో భవంతి నిర్మించుకోగలడు. కాని జనకుడువంటి వారు రాజ భవనంలో ఉంటారు కనుక ఊహించుకోవలసిన అవసరం ఉండదు. ఆలోచనా శక్తితో ప్రపంచం అంతటా విచరించే సాధకులకు గుహలో ఉన్నా శాంతి ఎలా లభిస్తుంది? కాని జనక మహారాజు వంటి వారు రాజ భవనంలోని విలాసమయ జీవితం గడుపుతూనే అనూహ్యమైన శాంతిని పొంద గలుగుతారు. నా ముక్తికి మార్గం నా దేశానికి సేవ చేయటం, తద్వారా మానవ జాతికి సేవ చేసేందుకు నిరంతర కృషి సల్పటం. చరాచర సృష్టిలోని ప్రతి ప్రాణితోటి తాదాత్మ్యత చెందాలని నా సంకల్పం. "సమః శత్రౌ చ మిత్రే చ" లాగా ఉండాలని నా కోరిక. అందుకే

---

3.4.1924. పుట 373. సంపుటం 23. గాంధీ వాఙ్మయం

ఎవరైనా ముస్లింలు, హిందువులు, క్రైస్తవులు నాతో వైరం పెట్టుకున్నా, నేను వాళ్ళను నా భార్య, బిడ్డలను ప్రేమించినట్లే ప్రేమిస్తాను. ఈ విధంగా నా దేశ భక్తి నా ముక్తికి సోపానం, శాంతిలోకానికి వెళ్ళే ప్రయాణంలో ఒక విశ్రామ స్థలం. దీనితో ఒకటి స్పష్టంగా తెలుస్తుంది. నాకు సంబంధించిన మటుకు మత రహిత రాజకీయమనే వస్తువు లేదు. మతాన్ని రాజకీయం అనుసరిస్తుంది. మతం లేని రాజకీయ వాదం ఉరి వేసుకున్నట్లే. ఎందుకంటే దాంట్లో రాజకీయానికి ఆయువు పట్టు పోయినట్టే.

[ఆంగ్లం నుండి]
యంగ్ ఇండియా, 3.4.1924



9

## శుద్ధి, మతం మార్పు

దీనికి హిందూ మతంలో ఆ అర్థంలో స్థానం లేదు. ఆర్య సమాజ మతస్థులు వాళ్ళ మత ప్రచారానికి క్రైస్తవుల పద్ధతిని అవలంబించినట్లు నాకు అనిపిస్తుంది. తమ మతంపై విశ్వాసం పెంపొందించేందుకు అనుసరించే ఈ విధానం నాకు అంతగా నచ్చదు. దీనివల్ల మంచికి బదులు చెడు పరిణామాలే ఉంటాయి. నిజంగా చూస్తే మతం మార్పు అనేది హృదయానికి సంబంధించినది. వ్యక్తికి - స్రష్టకు మధ్య ఉన్న సంబంధం మీద ఆధార పడింది. కాని ఈ మధ్య మనుష్యులలోని స్వార్థపూరిత ప్రవృత్తులను ప్రోత్సాహించి బహిర్గతం చేసే పద్ధతి అనుసరించటం జరుగుతున్నది. ఆర్య సమాజీయులకు మిగిలిన మతాలను దూషించటానికి మించిన ఆనందమేమీ లేదు. హిందువుగా నా నమ్మకం ఏమిటంటే - అన్ని మతాలు కొద్దో గొప్పో నిజమైనవే. అన్నింటి ఉత్పత్తి ఒకే ఈశ్వర తత్త్వం నుంచే అయింది. అయినా అన్ని మతాలు అసంపూర్తిగానే ఉంటాయి. దీనికి కారణం అవి మానవ మాత్రులు అందించినవి కనుక, మానవుడు పరిపూర్ణుడు కాడు. అవ లేదు. కనుక నిజమైన శుద్ధి చేయాలంటే ప్రతి మనిషి, స్త్రీ కాని, పురుషుడు కాని వారి వారి మతాన్ని అనుసరిస్తూ పరిపూర్ణత సాధించేందుకు ప్రయత్నించాలి. ఈ పద్ధతిలో మనిషి యొక్క గుణమే ఒకే ఒక గీటు రాయి. మనిషికి నైతికంగా ఎదగటానికి సహాయ పడకపోతే మతం మార్పిడి వల్ల ఏమి ప్రయోజనం? నా మతస్థులే ఈశ్వరుని ఉనికిని ఒప్పుకోకుండా ఉంటే మిగిలిన మతాలవారిని ఈశ్వరుని సేవ కొరకు (శుద్ధి, మతం మార్పు అంటే ఇదే అర్థం అని అనుకోవాలి)

---

29.5.1924, పుటలు 152-153, సంపుటం 24, గాంధీ వాఙ్మయం

నా మతంలోకి ఎందుకు తీసుకోవాలి? ముందర మీ ఇల్లు చక్కబెట్టుకోండి అన్న నానుడి లౌకికంగా కాకుండా మత పరంగా అన్వయించటం సబబుగా ఉంటుందని నా వ్యక్తిగత అభిప్రాయం. ఆర్య సమాజీయులకు వారి అంతరాత్మ ఈ ఆందోళనవైపు పురికొల్పితే అదే పద్ధతిని అవలంబించే హక్కు వాళ్ళకు ఉంది. ఈ అంతర్నాదం సమయస్ఫూర్తిని గాని, అనుభవమనే అంకుశాన్ని కాని గుర్తించదు. ఒకవేళ అంతరాత్మ ప్రబోధం వల్ల ఆర్య సమాజీయులు కాని, ముస్లింలు వారి వారి మత ప్రచారం చేస్తే హిందూ-ముస్లింల ఐక్యతకు భంగం కలుగుతుంది. అంటే ఆ ఐక్య భావం పైపైది అన్న మాట. మనం ఇటువంటి ఉద్యమం చూచి భయపడటం ఎందుకు? కాని ఈ ఉద్యమాలను పవిత్రభావంతో నడపాలి. ఒకవేళ ఎవరైనా మళ్ళీ హిందూ మతాన్ని స్వీకరిస్తాము అంటేవాళ్ళకు ఎప్పుడు కావాలంటే అప్పుడు మతం మార్పుకు అవకాశం, హక్కు ఉంది. కాని ఒకరి మత ప్రచారం కోసం ఇతరుల మతాన్ని దూషించే ప్రవృత్తి మంచిది కాదు. ఎందుకంటే ఇది సహనశీల స్వభావానికి విరుద్ధమైనది. ఇటువంటి ప్రచారానికి సరైన సమాధానం బాహాటంగా దాన్ని నిరసించటమే.



## 10

# హిందువులు ఏమి చేయాలి?

భారత దేశంలో ఉన్న హిందువులు, ముస్లింలు ఒకే జాతికి చెందిన వారైనప్పటికీ మతం, వాతావరణం వారిని వేరు చేసింది. ఆలోచనలవల్ల మనిషి యొక్క రూపం, స్వభావం మారుతుంది అని నా నమ్మకం, నేను చూసిన సత్యం. సిక్కుల విషయంలో మనం ఈ విషయం గమనించ వచ్చు. ముస్లింలు అల్ప సంఖ్యాకులు. అందుకని వారు ఒక సముదాయంగా మారి ఆతతాయులుగా మారారు. దానికి తోడు వాళ్ళు ఒక క్రొత్త పరంపరకు వారసులు. క్రొత్త ప్రణాళిక ఆశయాలకు అనుగుణంగా వాళ్ళల్లో ధైర్య సాహసాలు కన్పిస్తాయి. కురాన్లో అహింసకు చాలా ప్రముఖ స్థానం ఉందని నా భావం; కాని 1300 సంవత్సరాలు సామ్రాజ్య విస్తరణ చేయటం వల్ల ముస్లిం జాతి ఘర్షణ ప్రధానమైపోయింది. అందుకని పొగరుబోతు తనం అలవాటయిపోయింది. దౌర్జన్యం పొగరుబోతుతనం యొక్క సహజ పరిణామమే. హిందువుల నాగరికత చాలా ప్రాచీనమైనది. అహింస దాంట్లో అంతర్నిహితమై ఉన్నది. ఈ నాగరికత ఎన్నో అనుభవాలను సంతరించుకున్నది. ఈ రెండు జాతులు కూడా ఇంకా ఆ అనుభూతుల్ని అనుభవించాల్సి ఉంది. ఒక వేళ హిందూ మతంలో ఎప్పుడైనా సామ్రాజ్య వాదం ఉన్నప్పటికీ ఆ యుగం గడిచి పోయింది. స్వయంగా ఆలోచించి గాని లేక కాల చక్రపు ఒరవడిలో గాని ఆ సామ్రాజ్య వాదానికి స్వస్తి చెప్పటం జరిగింది. దీంట్లో అహింసకు ప్రాధాన్యం ఇవ్వటం వల్ల అస్త్రాల ప్రయోగం కొన్ని జాతుల మటుకే పరిమితం అయింది. ఈ జాతులు ఔన్నత్యం గలిగి, ఆధ్యాత్మిక దృక్పథం ఉన్న త్యాగ ధనుల అనుశాసనానికి అనుగుణంగా నడుచుకోవటం

---

19.6.1924, పుటలు 276-277, సంపుటం 24, గాంధీ వాఙ్మయం

ధర్మంగా స్వీకరించారు. అందుకని హిందువుల వద్ద ఘర్షణకు సంబంధించిన మానసిక ఉపకరణాలు లేవు. కాని వారి ఆధ్యాత్మిక శిక్షణను అక్షుణ్ణంగా ఉంచుకోలేకపోవటం వల్ల అస్త్ర శస్త్ర ప్రయోగం బదులు మిగిలిన ఉపకరణాలు వాడటం మర్చిపోయారు. అస్త్ర ప్రయోగం తెలియకపోవటం వల్ల దాని పట్ల ఆసక్తి లేదు కనుకవాళ్ళ వినయ విధేయతలు అధైర్యము, బలహీనతకు ప్రతి రూపాలు అయి పోయినాయి. ఈ విధంగా వారి సౌజన్య స్వభావం వారి బలహీనతకు దారి తీసింది.

ఇటువంటి అభిప్రాయం ఉన్నప్పటికీ హిందువుల పార్థక్య భావం చెడ్డదయినా వారి పిరికి తనానికీ దీనికీ సంబంధం ఉన్నదని నేను అనుకోను. ఆత్మ రక్షణ కోసం శిక్షణ శాలల మీద నాకు నమ్మకం లేకపోవటానికి కారణం కూడా ఇదే. శారీరిక బలానికి ఇవి దోహద పడుతాయి కాని ఆత్మ రక్షణ కోసం ఆధ్యాత్మిక విద్యాభ్యాసం మళ్ళీ పునరుజ్జీవింప చేయటం మంచిదని నా అభిప్రాయం. ఆత్మ రక్షణకు ఉత్తమమయిన, చిరస్థాయిగా ఉం డే సాధనం ఆత్మశుద్ధి. నేను ఈ నిరాధారమైన భయాలను చూసి బెదిరే వాణ్ణి కాను. హిందువులలో ఆత్మ విశ్వాసం ఉన్నట్లయితే వారు తమ సంప్రదాయాన్ని అను సరించినట్లయితే దౌర్జన్యాన్ని చూసి భయపడాల్సిన అవసరమే ఉండదు. ఏ గడియనుండి నిజమైన ఆధ్యాత్మిక శిక్షణను మళ్ళీ ఆత్మగతం చేసుకుంటారో, ఆక్షణం నుండీ ముస్లింలమీద దాని ప్రభావం ఉంటుంది, ఉండక తప్పదు. వాళ్లమీద వాళ్ళకు నమ్మకం ఉండి, ముస్లింలకు వాళ్ళ మీద నమ్మకం ఉన్న యువకుల బృందం కనుక నాకు లభించినట్లయితే అది బలహీనులకు కవచంలాగా ఉంటుంది. వాళ్ళు (హిందూ యువకులు) మనకు చంపకుండా చావటం ఎలా అని చెప్పగలుగుతారు. నా అభిప్రాయంలో ఇంకొక మార్గం కూడా లేదు. మన పూర్వీకులు కష్టాలను ఎదుర్కొనేటప్పుడు తపస్సు ఆత్మ శుద్ధి మీద ఆధార పడే వారు. వాళ్లు శారీరక అసమర్ధతను గుర్తించి దీన భావంతో భగవంతుణ్ణి ప్రార్థించే వారు. వారి మొర విని పరుగెత్తి వచ్చే దాకా ప్రార్థన చేస్తూ ఉండేవారు. కాని నా హిందూ మిత్రులు ఇది అనవచ్చు. అవును. కానీ భగవంతుడు తన అవతారాలన్నింటిని ధనుర్బాణాలు, సుదర్శన చక్రాలతోటే పంపించటం జరిగింది. ఇది యదార్థమే. కాదనటం లేదు. హిందువులకు నేను చెప్పేది ఒక్కటే. హిందువులవటం వల్ల వాళ్ళు కార్య సాధనకు అవసరమైన సాధనాన్ని కించ పరచి ఫలసిద్ధి పొందలేరు. మనం చాలా తపస్సు చేసిన తరువాత

కాని యుద్ధం చేయుటకు సంసిద్ధులం కాలేము. మనం ఎంత పరిశుద్ధులమవ్వాలో అంత పరిశుద్ధులం అయినామా అనేది నా ప్రశ్న. వ్యక్తిగతమైన పవిత్రతమాట ఎలాగున్నా అస్పృశ్యతకు సంబంధించిన పాపానికి ప్రాయశ్చిత్తం మనస్ఫూర్తిగా చేసామా? మన మతాచార్యులూ, మత గురువులూ వాళ్లు ఉండవలసిన పద్ధతిలో ఉన్నారా? ముస్లింల తప్పులను ఏకరువు పెట్టడంలోనే మన శక్తిని వృధా పరచినట్లయితే గాలిలో కాళ్ళూ చేతులూ విదిలించినట్లవుతుంది.



# 11

# హిందూ మత పరిస్థితి

హిందూ మతం ప్రాణవంతమైన మతం. దానిలో ఉన్నతి అవనతి రెండూ ఉన్నాయి. ప్రపంచ నియమాలకు అనుగుణ్యంగా నడుస్తుంటుంది. చెట్టుకు మూలం ఒకటే. కాని శాఖలు, ఉప శాఖలు అనేకం. అది ఋతువులను బట్టి మార్పు చెందుతూ ఉంటుంది. వసంత ఋతువు వస్తుంది, శిశిరమూ వస్తుంది, శరద్ ఋతువు, గ్రీష్మ ఋతువులూ వస్తాయి. వర్ష ఋతువులో మార్పులు రాక తప్పవు. దాంట్లో శాస్త్రాలు ఒక విధంగా ఉన్నాయి. ఇంకో విధంగా లేవు. దానికి ఆధారం ఒకే గ్రంధం కాదు. 'భగవద్గీత'ను అందరూ చదువుతారు. కాని అది కేవలం మార్గ దర్శకం మాత్రమే. నమ్మకాల మీద దాని ప్రభావం తక్కువే. హిందూ మతం గంగా ప్రవాహం వంటిది. మొదట్లో పరిశుద్ధంగా ఉంటుంది. దారిలో మాలిన్యం ప్రవేశిస్తుంది. కాని చివరకు ఎలాగైతే గంగా ప్రవాహం పోషక ప్రవృత్తి కలిగి ఉన్నదో అదే విధంగా హిందూ మతం కూడా పోషణ ప్రవృత్తి కలిగి యున్నది. ప్రత్యేక ప్రాంతంలో ఆ ప్రాంతానికి అనుగుణంగా రూపు దిద్దుకుంటుంది. కాని నైసర్గిక తత్త్వంలో మార్పు రాదు. నమ్మకాలు, ఆచారాలు మతంకాదు. వీటిలో మార్పులుంటాయి. కాని వీటికి మూలాధార సూత్రం ఒకటే. దానిలో ఏ మార్పు రాదు.

హిందూ మతం యొక్క పరిశుద్ధత హిందువులు చేసే తపస్సు మీద ఆధార పడి ఉంటుంది. ఎప్పుడయినా ఈ మతం క్లిష్ట పరిస్థితిని ఎదుర్కొన వలసి వచ్చినప్పుడు హిందువులు తపస్సు చేసారు. దానిలో చేరిన మాలిన్యానికి మూలం వెదికి పరిష్కార మార్గం వెదికారు. శాస్త్రసంపద పెరుగుతూనే ఉంది. వేదాలు, ఉపనిషత్తులూ, స్మృతి,

7.2.1926, పుటలు 436-439, సంపుటం 29, గాంధీ వాఙ్మయం

పురాణ, ఇతిహాసాలు ఒకేసారి రచింపబడలేదు. సమయ సందర్భాలకు అనుగుణంగా వివిధ గ్రంథాల రచన జరిగింది. అందుకనే వాటిలో కొన్ని విషయాలకు పొంతన లేనట్టుగా అనిపిస్తుంది. వాటిలో సనాతన సత్యాలు కాకుండా ఆ సత్యాలను ఆ కాలంలో ఎలా ఆచరించారో మనకు తెలియ చెప్పుతున్నాయి. ఆ కాలానికి అనుగుణంగా ఉన్న ఆచరణ విధానం ఈరోజు కూడా తు. చ. తప్పకుండా అవలంబించాలంటే అది సాధ్యమవదు. మనం నిరాశ చెందక తప్పదు. ఒకప్పుడు మన దేశంలో పశు యజ్ఞం జరిగేది. అలా అని ఈరోజు కూడా ఇటువంటి యజ్ఞం చేయటం సబబుగా ఉంటుందా? ఒకప్పుడు మనం మాంసాహారులుగా ఉండేవాళ్ళం-అలా అని ఈరోజు మనమందరం మాంసాహారులమై ఉండటం అవసరమా? ఒకప్పుడు దొంగల కాళ్ళూ చేతులు నరికి వేసేవారు-ఈ రోజు ఆ పద్ధతి అవలంబించగలమా? ఒకప్పుడు అనేక భర్తృకత పద్ధతి మన సమాజంలో ఉండేది, కాని అది ఈ రోజు కూడా సమ్మతమేనా? ఒకప్పుడు బాలికా వివాహం సర్వ సాధారణంగా ఉండేది. కాని మనకు ఈ రోజు సమ్మతమేనా? ఒక కాలంలో కొంతమందిని తిరస్కరించాము. కాని, వాళ్ళ సంతతిని కూడా తిరస్కరించటం సమంజసమేనా?

హిందూ మతం మార్పు లేని జడ పదార్థం కాదు. జ్ఞానం అనంతం, సత్యాన్వేషణకు అంతులేదు. ఆత్మ శక్తిని గురించి ఆలోచన జరుగుతూనే ఉంది, జరుగుతూ ఉంటుంది. మనం అనుభవాలు నేర్పే పాఠాలు నేర్చుకుంటూ అనేక విధాలుగా మార్పు చెందుతూ ఉంటాము. సత్యమొక్కటే కాని దాని సమగ్ర స్వరూపాన్ని అవగాహన ఎంతమంది చేసుకోగలిగారు? అనాదిగా ఉన్న వేదాలు, సత్యాలను పూర్తిగా తెలుసుకున్న వాళ్ళు ఎంతమంది? ఈ రోజు మనం వేదాలు అనుకున్నవి సమగ్ర వేదాలలో సహస్రాంశం కూడా కావు. మన దగ్గర ఉన్న వేదాలలో కూడా పూర్తిగా అర్థం తెలిసిన వాళ్ళు ఎంత మంది ఉన్నారు?

బృహత్తర శాస్త్ర సారాన్ని సూత్రప్రాయంగా మహర్షులు మనకు అందించారు-పిండంలో ఉన్నదే బ్రహ్మాండంలో ఉన్నది అన్నారు. బ్రహ్మాండం తెలుసుకోవటం చాలా కష్టం. కాని తనను తాను అర్థం చేసుకోవటం సాధ్యమే. తనను తాను అర్థం చేసుకున్నట్టయితే ప్రపంచాన్ని అర్థం చేసుకున్నట్టే. కాని దీనికి ప్రయత్నం చాలా అవసరం. ఆ ప్రయత్నం కూడా నిర్మలంగా ఉండాలి. నిర్మలమైన హృదయం లేనిదే ప్రయత్నం నిర్మలంగా ఉండదు. ఈశ్వరానుగ్రహం లేకపోతే యమ-నియమ పాలన

కష్ట సాధ్యమవుతుంది. శ్రద్ధ, భక్తి లేకపోతే భగవదనుగ్రహం లభించదు. అందుకే తులసీ దాసు రామ నామంలో ఉన్న మహిమ గురించి గానం చేసారు. భాగవత కర్త ద్వాదశాక్షరీ మంత్రం నేర్పారు. హృదయంతో వీటిని జపించగల వాళ్ళే నిజమైన హిందువులు.

మిగిలిన వాళ్ళందరూ భక్త అఖా అన్నట్లు గాఢాంధకూపాలే.

ఇక రచయితకు వచ్చిన అనుమానాల గురించి ఆలోచిద్దాం. యూరోప్ దేశస్తులు మన ఆచారాలను తెలుసుకుంటారు కాని వాటిని పరిశీలిస్తారు అని నేను అనుకోవటం లేదు. వాళ్ళు దానిలోని దోషాలను వెదకాలనే చూస్తారు. అందుకనే నేను నా మతం గురించి వాళ్ళ దగ్గర నేర్చుకో దలచలేదు.

కాని హిందూ మతం ఆహారానికి సంబంధించిందే కాదు. దానికంటే ఎన్నో రెట్లు ముఖ్యమైనది ఆచరణ విధానం, సత్యం, అహింసను నిత్య జీవితంలో అమలు పరచటం. గోమాంసం పరిత్యజించి దర్పంగా ఉండే ముని కంటే గోమాంసం తినే దయామయుడు, సత్యవంతుడు, భగవద్భీతి గలిగిన వాడు వేయి రెట్లు మంచి హిందువు. సత్యం పలికేవాడు, సత్యాన్ని ఆచరించే వ్యక్తి, గోమాంస భక్షణలోని హింసను గ్రహించ గలిగితే, తెలుసుకుని దాన్ని పరిత్యజిస్తే, ప్రతి జీవి పట్ల దయా భావనతో వ్యవహరించ గలిగితే, అతనికి శతకోటి నమస్కారాలు. అతను భగవంతుణ్ణి సాక్షాత్కరించుకున్నాడు, పరమ భక్తుడు, జగద్గురు స్థాయినందుకున్నాడు.

ఈరోజు హిందూ మతం, అన్య మతాలను పరిశీలిస్తున్నాము. సనాతన సత్యం ఒక్కటే. భగవంతుడు కూడా ఒక్కడే. రచయిత, పాఠకులు, మనమందరం విభిన్న మతాల మోహ జాలంలో పడకుండా సత్యమైన సరళ మార్గాన్ని అనుసరించినప్పుడే సనాతన హిందువులుగా ఉండ గలుగుతాము. సనాతన హిందువులనుకున్న వాళ్ళు చాలామంది దారి తప్పారు. వారిలో ఎవరికి సిద్ధి లభిస్తుందో ఎవరికి తెలుసు. రామనామ జపం చేసేవాళ్ళు చాలా మంది ఉంటారు కానీ రామ కార్యం చేసే కొద్దిమందికి మాత్రమే విజయం లభిస్తుంది.

[గుజరాతీ నుండి]
నవ జీవన్, 7.2.1926



12

# అస్పృశ్యతా రావణుడు

ఈ నాటి మన పరిస్థితులతో పౌరాణిక కథల ఆశయాన్ని అన్వయం చేసుకోకుండా అనుసరిస్తే అందులో కొన్ని కథలు చాలా ప్రమాదానికి దారి తీయ వచ్చు. శాస్త్రాలలో చెప్పిన చిన్న పెద్ద సంకేతాలను అనుసరించి మనం జీవితం గడుపుతూ వాటిలో వర్ణించిన పాత్రలను యథాతథంగా అనుసరించడం ఆరంభిస్తే ఈ శాస్త్రాలు మనకు ప్రాణాపాయం తెచ్చే మాయా జాలంగా పరిణమించవచ్చు. వాటి వల్ల మనకు కేవలం కొన్ని ముఖ్య సిద్ధాంతాలను సరిగా అర్థం చేసుకునేందుకు సహాయం లభిస్తుంది. ఏదో ఒక ధార్మిక రచనలో ఎవరో ప్రసిద్ధ పురుషుడు పాపకృత్యం చేశాడని ఉంటే దాని వల్ల మనకు కూడా పాపం చేసేందుకు అనుమతి లభిస్తుందా? ఒక్క పర్యాయమైనా సరే మహా పురుషుడు మనకు ఈ ప్రపంచంలో కేవలం సత్యమే ప్రబల తత్త్వమని సత్యమే ఈశ్వర తుల్యమని చెబితే అదే మనకు చాలు. ధర్మరాజుకు కూడా అబద్ధం చెప్ప వలసి వచ్చిందని చెప్పటం సమంజసం కాదు. అంతకంటే అబద్ధం చెప్పినందువల్లే ఆ క్షణంలోనే ఆయనకు కష్టాలు అనుభవించవలసి వచ్చిందని చెప్పటం ఎక్కువ సమంజసమవుతుంది. అందు వల్ల ఆయన ప్రసిద్ధి, సామాజిక గౌరవం శిక్ష అనుభవించేటప్పుడు అడ్డు రాదు. అలాగే ఆది శంకరులు చండాలుణ్ణి దూరంగా తొలగమని చెప్పాడని అనటం సమంజసం కాదు. ప్రతి జీవిని తనతో సమానంగా చూడాలని బోధించే మతం క్షుద్రజీవి పట్ల కూడా నిర్దాక్షిణ్యంగా ప్రవర్తించటాన్ని సహించదని గ్రహించటం శ్రేయస్కరం. నిరపరాధులకు చెందిన మానవ సమాజాన్ని పూర్తిగా బహిష్కరించటం ఆ మతం

29.7.1926, పుటలు 220-221, సంపుటం 31, గాంధీ వాఙ్మయం

ఏమాత్రం సహించదని అర్థం చేసుకోవాలి. ఆ మాటకు వస్తే ఆది శంకరులు నిజంగా ఏమి చేశారో, ఏమి చేయలేదో తెలుసుకునేందుకు ఏవిధమైన ఆధారం కూడా మనకు లేదు. ఈ సందర్భంలో చండాల శబ్దం ఏ అర్థంతో వ్యవహరింప బడిందో మనకు అసలే తెలియదు. దీనికి చాలా అర్థాలున్నాయనీ, వాటిలో ఒకటి పాపాత్ముడనీ అందరూ అంగీకరిస్తారు. పాపాత్ములనందరినీ అంటరాని వారని వెలివేస్తే మనమందరం అంటరాని వాళ్ళమే అయిపోతాం. చివరకు మన శాస్త్రివర్యులు కూడా తప్పుకోలేరు. అంటరానితనం పురాతనమైనదని ఒప్పుకోని వాళ్ళుండరు. ఆ అంటరానితనం దోషంగా అంగీకరించి నప్పుడు ప్రాచీనత పేరు చెప్పి దానిని సమర్థించటం కూడా మంచిది కాదు.



13

# తులసీ దాసు

> రామాయణం చాలా ఉత్తమ గ్రంథమని మీరు భావిస్తారు. కాని ఎందుకో అర్థం కాదు. చూడండి తులసీ దాసు స్త్రీ జాతిని ఎంత నీచంగా చూచారు? వాలి వధను ఎలా సమర్థించారు, విభీషణుడు చేసిన దేశ ద్రోహాన్ని ఎంతగా ప్రశంసించారు. సీతా దేవికి ఘోరమైన అన్యాయం చేసిన రాముణ్ణి అవతార పురుషుడన్నారు. అలాంటి గ్రంథంలో మీకు ఏమి సౌందర్యం కనిపిస్తున్నదండి? తులసీ దాసు గారి కావ్య చాతుర్యం చూచి మీరు రామాయణం సర్వోత్తమ గ్రంథం అనటం లేదు కదా? అదే నిజమైతే కావ్య పరిశీలన చేసేందుకు మీకేమీ అధికారమే లేదని చెప్పవలసి వస్తుంది.

పై ప్రశ్నలన్నీ ఒకే స్నేహితుడు వేసినవి కావు. వేరు వేరు మిత్రులు వేరు వేరు సందర్భాలలో అన్నవి, వ్రాసినవి-అన్నింటికీ సారాంశమిది. ఇలాంటి మాటల్లో ఒక్కొక్కదాన్ని గురించి ఆలోచిస్తే రామాయణమంతా లోప భూయిష్ఠమని తీర్మానించ వచ్చు. ఇలా చూస్తే ప్రతి గ్రంథం, ప్రతి మనిషి లోపాల పుట్ట అని నిరూపించ వచ్చు. విషయం మనకు తృప్తినిస్తుంది. ఒక చిత్రకారుడు తన విమర్శకుల అభిప్రాయం తెలుసుకునేందుకు ఒక ప్రదర్శనలో తన చిత్తరువును ప్రదర్శించి దాని క్రింద ఇలా వ్రాశాడు: "ఈ చిత్తరువులో ఎవరికి ఎక్కడ లోపం కనిపిస్తే అక్కడ కలంతో గుర్తు పెట్టండి." చివరకు చిత్తరువులోని ప్రతి భాగం లోపాంకిత మయింది. కాని యదార్థం ఏమిటంటే చిత్తరువు చాలా

10.10.1929, పుటలు 589-591, సంపుటం 41, గాంధీ వాఙ్మయం

కళాత్మకమయింది. విమర్శకులు వేదాలలో, బైబిలులో, కురానులో కూడా చాలా దోషాలు చూపించారు. కాని ఈ గ్రంధాలను భక్తితో పఠించే వాళ్ళకు అవి దోషాలు అనిపించవు. ప్రతి గ్రంధాన్నీ, ఆ గ్రంధంలోని అంతర్యాన్ని దృష్టిలో ఉంచుకుని పరిశీలించాలి. ఇది బాహ్యపరిశీలన. ఏదయినా ఒక గ్రంధం బహు సంఖ్యాకులైన పాఠకులను ఎలా ప్రభావితం చేసిందో గమనించి దాని అంతరంగాన్ని పరిశీలించాలి. ఏ కోణం నుంచి చూచినా రామాయణం శ్రేష్ఠ రచనగా నిగ్గుతుంది. ఒక గ్రంధం సర్వోత్తమం అంటే అందులో దోషాలు లేనే లేవని కాదు. కానీ రామ చరిత మానస్‌ను గురించి చెప్పాలంటే అది లక్షలాది ప్రజలకు శాంతి ప్రసాదించిందని నిస్సందేహంగా చెప్ప వచ్చు. భగవంతుడంటే గిట్టని వాళ్ళకు ఆ గ్రంధం పారాయణం చేసినందు వల్ల భగవంతుడి మీద భక్తి కుదిరింది. ఈ నాటికీ ఈ మార్పు జరుగుతూ ఉంది. మానస్‌లోని ప్రతి పుటా భక్తి భరితమై ఉంటుంది. అది అనుభవ జన్యమైన జ్ఞానానికి నిధి.

పాపం చేసిన వాడు తన పాపాన్ని సమర్థించుకునేందుకు రామ చరిత మానస్‌ను ఉపయోగించుకుంటూ ఉండటం కూడా నిజమే. కాని అంత మాత్రాన రామ చరిత మానస్ చదివే వాళ్ళు కేవలం పాపాలనే నేర్చుకుంటారని చెప్పేందుకు వీలు లేదు. తులసీ దాసు గారు స్త్రీల పట్ల బుద్ధిపూర్వకంగా అన్యాయం చేసేరని నేను ఒప్పుకుంటాను. ఈ విషయంలోనే కాక ఇలాంటి చాలా విషయాల్లో తులసీ దాసు తన యుగంలో వ్యాపించిన నమ్మకాలను అధిగమించలేక పోయారు. అంటే తులసీ దాసు సంఘ సంస్కర్త కాదు, భక్త శిరోమణి అని చెప్పాలి. కాబట్టి ఈ దోషాలన్నీ మనం తులసీ దాసు పై ఆరోపించ కూడదు. వాటిని యుగ దోషాలుగా భావించాలి.

అలాంటప్పుడు సంస్కర్తల కర్తవ్యం ఏమిటి? తులసీ దాసు వాళ్ళకు సహాయకారి కారా? తప్పక అవుతారు. రామ చరిత మానస్‌లో స్త్రీ నింద చాలా ఉంది. కాని ఆ గ్రంధంలోనే సీతా దేవి పవిత్ర చరిత్ర కూడా మనకు విదిత మవుతుంది. సీత లేకుండా రాముడు లేడు. రామ కీర్తి సీతమీదనే ఆధారపడి ఉంది. సీతాదేవి యశస్సు రాముడిపై ఆధార పడి లేదు. కౌసల్య, సుమిత్రలాంటి పూజ్య వనితలు కూడా 'మానస్' లో ఉన్నారు. శబరి, అహల్య భక్తి భావానికి ఈ నాటికీ ప్రసిద్ధులు. రావణుడు రాక్షసుడు. కాని మండోదరి పతివ్రత. ఇలాంటి నిదర్శనాలు ఈ పవిత్ర భండాగారంలోఎన్నో కనిపిస్తాయి. ఇలాంటి నిదర్శనాల వల్ల

నా దృష్టిలో మనం తెలుసుకోవలసిన విషయం ఏమంటే తులసీ దాసు బుద్ధిపూర్వకంగా స్త్రీ నింద చేయలేదు. ప్రకృత్యా ఆయన స్త్రీల పట్ల పూజ్య భావం కలిగినవారు. ఇది స్త్రీ పాత్రలకు సంబంధించిన విషయం.

ఇక వాలి వధలాంటి వృత్తాంతాలను గురించి కూడా అభిప్రాయ భేదానికి ఆస్కారం ఉంది. విభీషణుడిలో నాకేమీ దోషం కనిపించదు. విభీషణుడు తన సోదరుని పై సత్యాగ్రహం చేశాడు. విభీషణుడి పాత్ర వల్ల మనం గ్రహించవలసింది ఏమంటే తన దేశం కానీ దేశ పాలకులు గానీచేసిన తప్పులను సహించడం, కప్పి పుచ్చటం దేశ భక్తి పేరు చెడగొట్టినట్లు అవుతుంది. అలా కాక దేశం లోని దోషాలను ప్రతిఘటించటం నిజమైన దేశ భక్తి అవుతుంది. విభీషణుడు రాముడికి సాయం చేసి దేశానికి మేలే చేశాడు. సీత పట్ల రాముడు నిర్దాక్షిణ్యంగా వ్యవహరించ లేదు. ఆయన మనసులో రాజ ధర్మానికీ దాంపత్యానురాగానికి మధ్య ద్వంద్వ యుద్ధం చెలరేగింది.

ఎవరి హృదయంలోనైనా ఇలాంటి అనుమానాలు శుద్ధ భావంతో ఉదయిస్తే వాళ్ళకు నేను చెప్పే సలహా ఏమంటే నేను కానీ నాలాంటి వాళ్ళూ మరెవరైనా కానీచెప్పే భావార్థాన్ని వాళ్ళు యాంత్రికంగా నమ్మకుండా అనుమానం వేసిన విషయాలను పరిహరించటం మంచిది. సత్యం అహింస లాంటి వాటికి విరుద్ధమయిన దాన్ని దేనినీ అంగీకరించ రాదు. రామచంద్రుడు మోసం చేసాడు కాబట్టి మనం కూడ మోసం చేయవచ్చునని భావించటం తప్పు దారి అవుతుంది. రాముడులాంటి వాళ్ళు ఎప్పుడూ మోసం చెయ్యరని పరిపూర్ణంగా నమ్మి పూర్ణ పురుషుడిగా ఆయన్ని ధ్యానించాలి. పూర్ణ దృష్టితో గ్రంధాన్ని పరి శీలించాలి. 'సర్వారంభా హి దోషేణ ధూమేనాగ్ని రివా వృతా' అన్న న్యాయాన్ని బట్టి అన్ని గ్రంధాలలో దోషాలు ఉంటాయి. కాబట్టి హంసలాగా దోషాలనే నీటిని త్యజించి గుణాలనే పాలను గ్రహించాలి. ఇలా అపూర్ణంలో సంపూర్ణాన్ని ప్రతిష్ఠించటం, గుణ దోషాలను వేరు చేయటం వ్యక్తుల మీదనూ, యుగ పరిస్థితుల మీదనూ ఆధారపడి ఉంటుంది. స్వయం పరిపూర్ణత కేవలం భగవంతుడిలోనే ఉంటుంది. అది చెప్పనలవి కానిది.

హిందీ నవజీవన్,
10.10.1929



14

# సంభాషణ: బేసిల్ మాథ్యూస్ ప్రభృతులతో

గాంధీజీ ఏదయినా ఆధ్యాత్మిక సాధన చేస్తారా? ఎలాంటి స్వాధ్యాయం ఆయనకు ఎక్కువ సహకరించింది? ఈ రెండు విషయాలు తెలుసుకోవాలని శ్రీ మాథ్యూస్‌కు కుతూహలం కలిగింది.

గాంధీ: యోగ సాధనలో నాకు ప్రవేశం లేదు. నేను చేసే సాధన నాకు నా చిన్నతనంలో నన్ను పెంచిన పని మనిషి నేర్పింది. భూతాలన్నా, ప్రేతాలన్నా నాకు భయం వేసేది. 'భూతాలూ లేవూ, ప్రేతాలూ లేవు, కాని నీకు భయం వేస్తే రామ నామం జపం చెయ్యి'-అని ఆమె నాకు చెప్పింది. చిన్నతనంలో నేను నేర్చుకున్న ఈ గుణపాఠం నా అంతఃకరణంలో ప్రవేశించి ఒక విరాట్ చింతనగా రూపొందింది. ఆ భావన తన భాస్కర తేజస్సుతో గాఢాంధకారంలో నేను గడిపిన ఎన్ని గడియలనో ప్రకాశవంతం చేసింది. ఇలాంటి ధైర్యాన్నే క్రైస్తవులు క్రీస్తు నామాన్నీ, మహమ్మదీయులు అల్లా పేరునూ జపించి పొంద వచ్చు. వీటన్నిటికీ పర్యవసానమొక్కటే. ఒకే రకమైన సన్నివేశాలలో ఒకే విధంగా అవి పరిణమిస్తాయి. కానీ జపం కేవలం పెదవులతో కాక అంతఃకరణ శుద్ధితో చెయ్యాలి. స్వాధ్యాయంలో నాకు సహకరించిన గ్రంథాన్ని గురించి చెప్పాలంటే మనం భగవద్గీతను నియమ పూర్వకంగా పఠిస్తాం. నిత్యం కొన్ని అధ్యాయాలు చదువుతూ పోతే ఒక వారంలో గీత పూర్తవుతుంది. దానితో పాటు భారత దేశంలోని అనేక భక్తులు వ్రాసిన పాటలు కూడా ఈ కార్యక్రమంలో చేరాయి. క్రైస్తవుల భక్తి

5.12.1936, పుటలు 85-86, సంపుటం 64, గాంధీ వాఙ్మయం

గీతాలు కూడా చేర్చుకున్నాం. ఖాన్ సాహెబ్ మాతో ఉంటారు కాబట్టి కురాన్ కూడా చదువుతాం. అన్ని మతాలు సమానమే అని మా నమ్మకం. తులసీ రామాయణం నాకు అన్నిటి కంటే ఎక్కువగా మనశ్శాంతిని ఇస్తుంది. న్యూ టెస్టమెంట్, కురాన్ వల్ల కూడా నాకు శాంతి లభించింది. నేను వాటిని విమర్శకుడి దృష్టితో చూడను. భగవద్గీత నాకెంత ముఖ్యమో అవికూడా అంతే. వాటిలోని ప్రతి మాట ఉదాహరణకు పాల్ ధర్మ సూత్రాలలోనివి నాకు నచ్చకపోవచ్చు. అది వేరే విషయం. తులసీ దాసు చెప్పినవి కూడా నాకు అన్నీ నచ్చవు. కాని గీత మాత్రం విశుద్ధమైన తత్త్వ బోధ. అది నిర్దుష్టమైనది. పరమాత్మను చేరేందుకు జీవాత్మ చేసే జీవిత యాత్ర అందులో వర్ణింప బడిన విషయం. అందువల్ల గుణదోష వివక్షకు ఆస్కారమే లేదు.

మాథ్యూస్: అయితే మీరు నిజానికి ప్రొటెస్టెంటా?

గాంధీ: నాకు తెలియదు. నేను ఎవరినో, ఎవరిని కానో, హాజ్ గారు నన్ను ప్రెస్‌బిటేరియన్ అంటారు.

మాథ్యూస్: చరమ సత్యాన్ని నిర్వచించేందుకు మీకు ఆధారం ఎక్కడ లభిస్తుంది?

గాంధీ: ఇక్కడ (తన గుండె వైపు చూపిస్తూ). మతానికి సంబంధించిన ప్రతి రచనా-గీత కూడా-చదివేప్పుడు, నేను నా ఆత్మ బుద్ధిని ఉపయోగిస్తాను. ఏ మత గ్రంథమైనా సరే అందులోని ఏ వాక్యం కూడా నా వివేకాన్ని గ్రసించడం నేను సహించ లేను. ముఖ్యమైన మత గ్రంథాలు ఈశ్వర ప్రేరితాలని నేను అంగీకరిస్తాను. కాని అవి రెండు అంచెలుగా మనకు అందుతాయనే విషయం కూడా నాకు తెలుసు, మొదట మానవ సందేష్ట ద్వారా అవి ఆవిర్భవిస్తాయి. ఆ తర్వాత అవి వ్యాఖ్యాతల ద్వారా, టీకాకారుల ద్వారా మనకు లభిస్తాయి. సాక్షాత్తు ఈశ్వర ముఖం నుండి వెలువడేది అందులో ఏదీ లేదు. ఒకే పాఠాన్ని మాథ్యూస్ ఒక రూపంలో, జాన్ మరో రూపంలో ప్రతిపాదించవచ్చు. దివ్య జ్ఞానం మీద నాకు నమ్మకం ఉన్నప్పటికీ నేను నా వివేకానికి తిలాంజలి ఇవ్వ లేను. అన్నిటికంటే విశేషమైన విషయం ఏమిటంటే 'శబ్దం హర్షింప జేస్తుంది. దానిలోని నిహితార్థం తరింప జేస్తుంది.' మీరు నన్ను అపార్థం చేసుకోకుండా ఉంటే నేనొక విషయం చెప్తాను. తర్కానికి ఆస్కారం ఇవ్వని విషయాల మీద కూడా నాకు నమ్మకం ఉంది, ఉదాహరణకు-భగవంతుడున్నాడనే విషయం. ఎలాంటి తర్క వాదం కూడా నా యీ నమ్మకాన్ని తొలగించ లేదు. ఎవరు ఎంత

వాదించినా మేము మాత్రం ఏడుగురమే! అని మాటి మాటికి నొక్కి చెప్పే ఆ బాలిక లాగా నేను కూడా అత్యంత మేధావి ప్రతిపాదించే ప్రబల తర్కానికి పరాజితుణ్ణయి కూడా 'అయినా భగవంతుడు మాత్రం ఉన్నాడ'ని ముమ్మాటికి చెప్తాను.

[ఆంగ్లం నుండి]
హరిజన్, 5.12.1936



15

## సంప్రతింపు : యం.సి. రాజాతో

శుద్ధమైన హిందూ మత దృక్కోణంలో బ్రాహ్మణుడు, చీమ, ఏనుగు శునక మాంస భక్షకులు అందరికీ ఒకే ప్రతిపత్తి ఉంది. మన తాత్విక దృక్పథం ఇంత ఉన్నత స్థాయికి చెందినదయినా మనం దాన్ని ఆచరించ లేక పోతున్నాము. అదే తాత్విక దృక్పథం ఈ నాడు కలుషితం అయిపోయింది. హిందూ మతం మానవ లోక సామరస్యమే కాక సమస్త జీవకోటిలోని ఏకాత్మతను చాటి చెప్తుంది. ఈ ఉదాత్తమైన ఊహ మనకు వెంటనే బోధ పడదు. కాని ఆ స్థాయికి మనం ఎదగాలి. మనిషికి మనిషికి మధ్య ఒక నిజమైన, జీవంతమైన అనుబంధం, సమానత్వం అనుభవించ గలిగిన నాడు మానవుడికీ, సమస్త బ్రహ్మాండానికి మధ్య సమానత్వం స్థాపించ గలుగుతాం. ఈ శుభోదయపు వేళ మనం ప్రపంచంలో శాంతిని, పరస్పర మానవతతో నిండిన సౌహార్దాన్ని నెలకొల్ప గలుగుతాము.

---

28.3.1936. పుటలు 299-300, సంపుటం 62, గాంధీ వాఙ్మయం



16

## ఉపన్యాసం : క్విలోన్ లో

ఇప్పుడు కొంచెం హిందూ మతంలో ఇమిడి ఉన్న అసలైన తత్వాన్ని గురించి ఆలోచిద్దాం. ఇంతమంది చరిత్రకెక్కిన మహనీయులూ, సాధు పురుషులూ అందులో ఏమి చూచి ఇంతగా ప్రేరితులైనారు? ప్రపంచానికి ఇంతమంది తాత్త్వికులను ప్రసాదించిన మూలతత్త్వం ఏమిటి? ఇంతమంది భక్తులు శతాబ్దాలనుంచి ఈ మతం కోసం తమ సర్వస్వం ధారపోశారంటే అందులో ఉన్న గొప్పతనం ఏమిటి? అందులోని అంటరానితనాన్ని చూచి కూడా దానికి వీళ్ళు అంకితమైపోయారా? అంటరానితనాన్ని నిర్మూలించాలని ఆందోళన చేసినప్పుడు హిందూ మతంలోని సార తత్త్వమేమిటని చాలామంది కార్య కర్తలు నన్ను అడిగారు. ఇస్లాంలో ఉన్న 'కలమా' లాంటిది గానీ, బైబిల్‌లో 3-16 సెయింట్ జాన్‌లో ప్రతిపాదితమైన క్రైస్తవ మత మూల సిద్ధాంతం లాంటిది గానీ ఇందులో ఏదయినా ఉందా? అటు ఆలోచనా పరులకూ, ఇటు సామాన్య జనులకూ తృప్తినిచ్చేది మన దగ్గర ఏమయినా ఉందా? అని వాళ్ళు అడుగుతారు. గాయత్రీ మంత్రం అలాంటిది-అని కొందరు అంటారు. దానికి ఆధారం లేకపోలేదు. నేను గాయత్రీ మంత్రాన్ని అర్థం చేసుకుని వేల పర్యాయాలు దాన్ని జపించాను. కాని నా ఆధ్యాత్మిక పిపాసను ఆ మంత్రం పూర్తిగా తీర్చలేకపోయిందని ఇప్పటికీ నేను భావిస్తాను. మరి 'భగవద్గీత' అంటే ఎన్ని సంవత్సరాలనుంచో నాకున్న భక్తి మీకందరకూ తెలుసు. నా సమస్యలన్నింటికీ ఇందులో సమాధానం దొరుకుతూ వచ్చిందనీ, సంశయాలూ, కష్టాలు ఎదురయిన సమయంలో ఈ గ్రంథం నాకు కామధేనువుగా, మార్గ దర్శినిగా, సహకరించిందనీ నేను చెప్పాను.

---

30.1.1937, పుటలు 287-291, సంపుటం 64, గాంధీ వాఙ్మయం

నన్ను ఈ గ్రంథం నిరాశ పరచిన ఏ సందర్భం కూడా నాకు గుర్తు లేదు. కానీ, ఇక్కడ చేరిన శ్రోతలకందరికీ ఈ గ్రంథాన్ని మీరు స్వీకరించి తీరాలని చెప్పటం నాకు సాధ్యం కాదు. ప్రార్థనా పూరిత మనస్సుతో దీనిని బాగా చదివి, అర్థం చేసుకుని, మనన చేస్తేనే కానీ ఆ తల్లి చను గవ నుంచి పరమ పౌష్టికమైన పాలు మనకు ప్రాప్తించవు.

కాని హిందూ మతంలోని సమస్త తత్త్వ సారాన్ని తనలో కూర్చుకున్న ఒక మంత్రం ఉంది. ఆ మంత్రమే నేను మీకు వినిపించ దలచుకున్నాను. 'ఈశోపనిషత్తు' గురించి మీలో చాలామందికి తెలిసి ఉంటుందనే నేననుకుంటాను. చాలా సంవత్సరాల క్రితం నేను అనువాదం టీకా తాత్పర్యాలతో సహా చదివాను. యార్వాడ జైలులో నేను దీన్ని కంఠస్థం చేసుకున్నాను. అప్పుడు నన్నీ రచన అంత ముగ్ధుణ్ణి చేయలేదు. కాని గడచిన కొన్ని నెలల్లో మాత్రం మన ఉపనిషత్తు లన్నింటితో బాటు మన మత గ్రంథాలన్నీ అకస్మాత్తుగా నశించిపోయినా సరే ఒక్క ఈశోపనిషత్తులోని మొదటి శ్లోకం (మంత్రం) హిందువుల స్మృతి పథంలో శేషించి ఉంటే చాలు హిందూ మతం చిర కాలం జీవించి ఉంటుందని నేను గట్టిగా తీర్మానించి చెప్ప గలననే అనిపించింది.

ఈ మంత్రం నాలుగు భాగాలలో ఉంది. మొదటి భాగం "ఈశావాస్యమిదం సర్వం యత్కించ జగత్యాం జగత్" దీనికి నేను ఇలా అర్థం చెప్తాను: ప్రపంచంలో మనము ఏమేమి చూస్తామో వాటన్నింటిలో ఈశ్వర తత్త్వం వ్యాపించి ఉంది. తరువాత రెండు మూడు భాగాలు ఇవి: "తేన త్య క్తేన భుంజీథాః" దీన్ని రెండు భాగాలు చేసి వాటికి అర్థం ఇలా చెప్తాను: "దీనిని త్యజించు; దీనిని భుజించు." దీనికి మరో విధమైన అనువాదం కూడా ఉంది. దాని అర్థం కూడా దాదాపు ఇదే. 'ఈశ్వరుడు నీకు ఇచ్చినదాన్ని నీవు అనుభవించు'-అని ఆ అనువాదం చెప్తుంది. ఈ అనువాదంలోవి ఆశయాన్ని కూడారెండు భాగాలుగా చెప్పుకోవచ్చు. దీని తర్వాత దీని చివరి భాగం, అదే అన్నిటికంటే ముఖ్య మైనది. "మా గృధః కస్యస్విద్ధనమ్" అంటే ఎవరి సంపదను కూడా లోభ బుద్ధితో చూడకు, అని దీని భావం. ప్రాచీనమైన ఈ ఉపనిషత్తులోని మిగిలిన మంత్రాలన్నీ యీ మొదటి మంత్రానికి భాష్యాలే. ఒక విధంగా చూస్తే యీ మంత్రం యొక్క అర్థమే వాటిలో ఉద్ఘాటించి చెప్పేందుకు ప్రయత్నం జరిగింది. నా మట్టుకు నాకు, 'గీత' ను మనస్సులో పెట్టుకుని ఈ మంత్రం చదివినప్పుడు లేదా యీ మంత్రాన్ని మననం చేస్తూ 'గీత' చదివినప్పుడు 'గీత' కూడా ఈ

మంత్రానికి భాష్యమనే అనిపిస్తుంది. ఈ మంత్రం సమాజ వాదులకూ, సామ్యవాదులకూ, తత్త్వ జిజ్ఞాసులకూ, అర్థ శాస్త్ర విశారదులకూ అందరికీ సమాధానం అందిస్తుందని నా నమ్మకం. హిందూ మతాన్ని అనుసరించని వాళ్ళకు కూడా ఇది సమాధానం ఇయ్యగలదనే నేను సాహసపూర్వకంగా చెప్పగలను. ఇదే యథార్థమయితే-యథార్థమనే నా నమ్మకం-ఈ మంత్రంలోని ఆశయానికి అనుగుణం కాని విపరీతమైన భావం ఏదైనా హిందూ మతంలో ఉంటే దానికి ప్రాధాన్యం ఇయ్యవలసిన అవసరం లేదు. ఈశ్వరుడు ఒక్కడే జీవ కోటిని సృష్టించి అదుపులో ఉంచుకొనే వాడు. ప్రపంచంలోని ప్రతి కణంలో వ్యాపించి ఉన్నాడన్న సత్యం కంటే సామాన్య మానవుడికి తెలుసుకోవలసిన విషయం మరేముంది?

ఈ మంత్రంలోని మూడు భాగాలు నేరుగా మొదటి భాగంలోనుంచే వెలువడుతాయి. ఈశ్వరుడు సమస్త సృష్టిలో వ్యాపించి ఉన్నాడని మీరు నమ్మితే ఆయన ప్రసాదించని వస్తువును అనుభవించేందుకు వీలు లేదని కూడా మీరు నమ్మి తీరాలి. ఆయన అగణిత జీవ కోటికి సృష్టి కర్త కాబట్టి ఎవరి సొత్తునూ కూడా మీరు లోభ బుద్ధితో చూడకూడదనేది కూడా స్పష్టంగా తేలిపోతుంది. ఆయన సృష్టించిన అసంఖ్య జీవుల్లో మీరు కూడా ఒకరు అని భావిస్తే మీ సర్వస్వం త్యజించి ఆయన చరణాలపై అర్పించటం మీ ధర్మం అవుతుంది. అంటే ఈ త్యాగం కేవలం స్థూలమైన భౌతిక కార్యం కాక, వచ్చే జన్మలకు పునాది వేసే మహత్కార్యమవుతుంది. అజ్ఞానం వల్ల చేసే పని కాక ఆలోచనతో చేసిన పని అవుతుంది. అంటే అదో నూతన జన్మ. ప్రతి శరీరధారికీ అన్నం, నీరు, బట్టలు అత్యవసరం కాబట్టి తనకు కావలసిన వస్తువులను అతడు ఈశ్వరునే ప్రార్థించి సంపాదించు కుంటాడు. అతనికి ఇవన్నీ తాను చేసిన త్యాగానికి ఫలితంగా పారితోషికంగా లభిస్తాయి. అంత మాత్రంతో చాలదన్నట్టు ఈ మంత్రం చివరి భాగంలో ఒక చక్కని సందేశం అందించడం జరిగింది: ఎవరి సిరి సంపదలనూ కూడా లోభ దృష్టితో చూడకు. ఈ నీతిని జీవితంలో అమలు పెట్టటం తోనే నీవు ప్రపంచంలోని సమస్త జీవకోటితో పాటు శాంతి సౌహార్ధాలతో నివసించే బుద్ధిమంతుడవైన విశ్వ పౌరుడివి అయిపోతావు. దీనితో మనుష్యుల ఇహపరాలకు సంబంధించిన ఉన్నతోన్నత ఆశయాలు, ఆకాంక్షలూ నెరవేరుతాయి.



17

# ఉపన్యాసం: హరిపాద్ లో

నిన్న రాత్రి క్విలోన్ సమావేశంలో హిందూ మతం అందించే సందేశాన్ని గురించి నేను ప్రసంగించాను. ఈ సమావేశంలో ఆ విషయాన్ని గురించే మరి కొంత చెప్పేందుకు మీ సమయాన్ని తీసుకుంటున్నాను. ఆ సమావేశంలో 'ఈశోపనిషత్తు' లోని మొదటి మంత్రంలో సమస్త హిందూ మత సారం ఇమిడి ఉన్నదని చెప్పేందుకు సాహసించాను.

*ఈశావాస్యమిదం సర్వం యత్కించ జగత్యాం జగత్*
*తేన త్యక్తేన భుంజీథా మాగృథః కస్యస్విద్ధనమ్/*

ఇందులో మిగిలిన వేద మంత్రాల్లో లాగా అందరికీ బోధ పడని గూఢార్థం ఏమీ లేదని కొద్దిపాటి సంస్కృతం తెలిసిన వాళ్ళకు కూడా అర్థమవుతుంది. దీని భావార్థం సంగ్రహంగా ఏమిటంటే ప్రపంచంలో ప్రతి అణువులో ఎంత చిన్న వస్తువులోనైనా సరే, ఎంత పెద్ద పదార్థంలోనయినా ఈశ్వర తత్త్వం వ్యాపించి ఉంది. సృష్టి కర్త, జగత్పతి అనుకుంటున్న ఈశ్వరుడే అంతటా ఉన్నాడు. 'ఈశ' శబ్దానికి శాసించేవాడు అని అర్థం. సృష్టించేవాడు సహజంగా శాసిస్తాడు. ఈ శ్లోకం అల్లిన ఋషి ఈశ్వరుణ్ణి శాస్త (శాసించే వాడు)గానే నిరూపించాడు. ఈ శాసన పరిధినుంచి ఏ వస్తువునూ కూడా బయట ఉండనీయ లేదు కూడాను. మనం ఏమేమి చూస్తామో అవన్నీ ఈశ్వరుడు నివసించి శాసించేవే అని ఆ ఋషి సందేశం. ఈ ఆశయాన్నించే సహజంగా ఈ మంత్రంలోని మిగిలిన మూడు భాగాలు ప్రతిఫలిస్తాయి. ఆ మూడు భాగాల్లో చెప్పింది ఇది: సర్వస్వం త్యజించు. అంటే కేవలం ఈ చిన్న భూతలంలో ఉన్నదే కాదు, అఖిలాండం బ్రహ్మాండం అన్నింటిలో ఉన్న సమస్తాన్ని త్యజించు. సర్వస్వం త్యజించండని చెప్పడం ఎందుకంటే, మనం నిజానికి క్షుద్ర

30.1.1937, పుటలు 294-297, సంపుటం 64, గాంధీ వాఙ్మయం

పరమాణువుల్లాంటి వాళ్ళం. అలాంటప్పుడు మనం ఏదయినా వస్తువును స్వాయత్తం చేసుకునేందుకు ప్రయత్నించటం హాస్యాస్పదంగా ఉంటుంది. ఆ తర్వాత ఋషి చెప్పేది వినండి. ఈ త్యాగానికి ప్రతిఫలం 'భుంజీథాః'-అంటే నీకు కావలసిన వస్తువును నీవు అనుభవించు. కాని 'భుంజీథాః' అనే పదానికి ఒక ప్రత్యేకమైన అర్థం కూడా ఉంది. సామాన్యంగా మనం ఈ పదాన్ని ఉపయోగపరచుకోవటం లేక తినటం అనే అర్థంలో వాడవచ్చు. కాని ప్రత్యేకమైన అర్థంలో నీ వృద్ధికి ఎంత అవసరమో అంతకు మించి నీవు గ్రహించరాదని మంత్రార్థం. కాబట్టి ఉపయోగానికి గానీ, ఉపభోగానికి గానీ రెండు నియమాలున్నాయి. మొదటిది త్యాగం. భాగవత పరిభాషలో చెప్పాలంటే 'కృష్ణార్పణమస్తు సర్వం.' భాగవత సంప్రదాయంలో ప్రతి వ్యక్తి ప్రతి దినం ప్రాతఃకాలం లేవగానే తన మనస్సును, వాక్కును, కర్మలను ఈశ్వరార్పణం చేసుకోవాలి. అలా త్యాగం లేక సమర్పణ చేయకుండా ఏ వస్తువునూ స్పృశించ రాదు. పచ్చి మంచినీళ్ళు కూడా త్రాగకూడదు. అలా త్యాగం లేక సమర్పణ చేసిన తర్వాత దానికి ప్రతిఫలంగా అతని దైనందిన జీవితం గడిచేందుకు కావలసిన అన్నం, నీరు, వస్త్రం, నివాసం అనుభవించే అధికారం అతనికి లభిస్తుంది. కాబట్టి, భోగం త్యాగానికి ప్రతిఫలమని భావించినా సరే లేదా త్యాగం చేస్తేనే కానీ అను భవించేందుకు అధికారం లభించదని అర్థం చెప్పుకున్నా సరే, త్యాగం మన ఉనికికి, మన ఆత్మ నిరతికి అపరిహార్యమైన అవసరం అనే సత్యంలో వ్యతిక్రమం ఏమీ ఉండదు. ఈ మంత్రంలో నిర్వచించిన నిబంధన చాలదన్నట్టు ఆ మాట చెప్పిన మరు క్షణమే 'ఎవరి సంపత్తినీ లోభ దృష్టితో చూడరాద'ని ఋషి ఆంక్ష పెడతారు. నేను మాత్రం ప్రపంచంలోని వేదాంతమంతా, మతాల సారమంతా ఈ మంత్రంలో ఇమిడి ఉందని అంటాను. ధర్మ విరుద్ధమైనదంతా ఇందులో నిషేధించబడింది. మత గ్రంథాలను వ్యాఖ్యానించటంలో పాటించే నియమాలననుసరించి శ్రుతికి విరుద్ధమైనదంతా త్యాజ్యమే. మరి 'ఈశోపనిషత్తు' శ్రుతి విశేషమే.

ఇప్పుడు నేను ఈ మంత్ర దృష్ట్యా ఈనాటి మన శాసకీయ పరిస్థితులను పరిశీలించి చెపుతాను. బ్రహ్మాండంలోని ప్రతి వస్తువూ ఈశావాస్యమైతే బ్రాహ్మణుడు-పాకీవాడు, పండితుడూ-పామరుడూ ఇలవా - పరియా అందరినీ ఈశ్వరుడు ఆవసించే ఉన్నాడు. అలాంటప్పుడు ఒకరు గొప్ప, ఒకరు తక్కువ అనే భేదమే లేదు. అందరూ సమానులే.

అందరినీ ఒకే సృష్టికర్త సృష్టించాడు. ఇది కేవలం బ్రాహ్మణులకో, క్షత్రియులకో పరిమితమైన పాత్రతను ప్రతిపాదించే పరమ నిగూఢమైన వేదాంత తత్త్వం కాని మత సిద్ధాంతం కాని కాదు. దీని వల్ల ఒక శాశ్వత సత్యం ఆవిష్కరింపబడింది. దీనిని పరిమితం చేసేందుకు గానీ, హెచ్చు తగ్గులు చేసేందుకు గానీ అవకాశమే లేదు. కాబట్టి తిరువాంకూరు మహారాజు కానీ మహారాణి కానీ సామాన్య ప్రజల కంటే అవ గింజంతకూడా అతిశయులని చెప్పేందుకు వీలు లేదు. మనమందరం ఈశ్వరుని బిడ్డలం. ఆయన సేవకులం. మహారాజు గారు సామాన్య జనులలో సర్వ ప్రథముడు కావచ్చు. దానికి కారణం ఆయన రాజరికం కాదు, భగవత్ సేవలో ప్రథమ సేవకుడు కావటం అందుకు కారణం. కాబట్టి తిరువాంకూరును పాలించే ప్రతి మహారాజును 'పద్మనాభ దాసు' అనటం ఎంతో గొప్ప విషయం, శోభనీయమైన సంప్రదాయం. ఇది గౌరవ ప్రదమైన బిరుదు. తిరువాంకూరు మహారాజుకు ఈ బిరుదును ప్రసాదించిన వ్యక్తిని నేను అభినందిస్తాను. అందుకే మహారాజూ, మహరాణీ మనలో ఎవరికంటే ఆవగింజంత కూడా అతిశయులు కారని నేనన్నప్పుడు మహారాజూ, మహారాణీ సమ్మతించిన సత్యాన్నే మీ ముందు ప్రస్తావించాను. ఇది సత్యం అయినప్పుడు ఎవరయినా సరే తాను ఇతరుల కంటే మిన్న అని భావించేందుకు ఎలా సాహసించగలడు? కాబట్టి ఈ మంత్రం మాన్యతను మనం ఒప్పుకున్న తర్వాత కూడా ఎవరైనా తక్కువ కులం వాళ్ళు దేవాలయంలో ప్రవేశించినందు వల్ల ఆలయం అపవిత్రమౌతుందని కనక అంటే అలా అన్న వ్యక్తిని నేను ఘోరమైన పాపం చేసినట్లు భావించి అతన్ని అపరాధిగా ప్రకటిస్తాను. మీకు నిజం చెప్తాను-ఈ ప్రకటన వల్ల ఆలయాలు పవిత్రమైనాయి. వాటిని అలముకున్న కళంకం క్షాళితమైపోయింది.

ఈ మంత్రాన్ని స్త్రీ, పురుషులు, బాల బాలికలు తమ హృదయ మందిరంలో ప్రతిష్ఠించుకోవాలి అని నా కోరిక. ఈ మంత్రంలో హిందూ మతంలోని సార తత్త్వం సమావిష్టమై ఉన్నదని మనం నమ్మితే-నేను నమ్మినట్టు-ఈ మంత్రాన్ని అన్ని ఆలయాల ముఖ ద్వారాల మీద చెక్కించాలి. అప్పుడు ఈ ఆలయాల్లో ఎవరినైనా సరే మనం ప్రవేశించకుండా ఆపితే అడుగడుగునా మనం ఈ మంత్రాన్ని దూషించినట్టే అవుతుంది. కాబట్టి మీరు ఈ ఉదాత్తమైన ప్రకటనకు మీరు పాత్రులని భావిస్తే, మీరు మీ అంతఃకరణ శుద్ధిని కోరుకుంటూ మీ భాగ్య విధాతల పట్ల భక్తి శ్రద్ధలు కలిగి ఉంటే మీరు ఈ ప్రకటనను

అక్షరాలానే కాక భావనాపూర్వకంగా అమలు చేసి చూపించాలి. దీనిని నేను మహత్తరమైన ఆధ్యాత్మిక సోపానంగా భావిస్తాను. ఇందు వల్ల నాస్తికుల్లోని నాస్తికత నశించి పోతుంది. హిందూ మతాన్ని కానీ, మరే ఇతర మతాన్ని కానీ సందేహంతో చూచే వాళ్ళందరి సందేహాలూ దీనితో తీరి పోవాలి. దీన్ని సరిగ్గా అర్థం చేసుకుంటే నాస్తికులనబడే వాళ్ళ మనస్సులోని అజ్ఞానం, అందువల్ల ఏర్పడిన నాస్తికత తొలగి పోవాలి. ఈ ప్రకటన చేసిన నాటి నుంచీ తిరువాంకూరులోని ఆలయాలన్నీ, ఇంత వరకు దేవాలయాలు కానివి, ఇప్పుడు నిజంగా దేవాలయాలు అయ్యాయి. కారణం, అస్పృశ్యులనబడే వాళ్ళకు ఇకనుంచి ఈ ఆలయాల్లోకి ప్రవేశం నిషిద్ధం కాదు. కాబట్టి సంఘం ద్వారా బహిష్కృతులని భావించబడే వాళ్ళకు ఆలయ ప్రవేశం లభించిందన్న అసహనంతో ఆలయాలకు రావటం మానేసే స్త్రీ పురుషులు తిరువాంకూరులో ఎవ్వరూ ఉండరని నేను ఆశిస్తాను. భగవంతుణ్ణి అలా కాకుండా చూడ వలసిందని ప్రార్థిస్తున్నాను.

[ఆంగ్లం నుండి]
హరిజన్, 30.1.1937



18

# ఉపన్యాసం: కొట్టాయం బహిరంగ సభ లో

నాకు హిందూ మతంలోని సారతత్త్వం తెలుసు. అలా తెలుసుకునేందుకు నేను ప్రయత్నించాను. ఈ సందర్భంలో నేను 'ఈశోపనిషత్తు' లోని సరళ సుబోధమైన ఒక మంత్రాన్ని గురించి వాళ్ళకు చెప్పేను. వేదాలతో సమానమైన పవిత్రత గల ఉపనిషత్తులలో 'ఈశోపనిషత్తు' ఒకటి అని మీకు తెలిసే ఉంటుంది. 'ఈశోపనిషత్తు'లోని మొదటి మంత్రం యొక్క భావార్థమిది: "ఈ ప్రపంచంలోని కణకణంలో ఈశ్వరుడు వ్యాపించి ఉన్నాడు." ఈ మంత్రంలో భగవంతుణ్ణి ఈ ప్రపంచానికి స్రష్టగా, పాలకుడిగా, అధిష్ఠాతగా నిరూపించటం జరిగింది. ఈమంత్రాన్ని సందర్శించిన ఋషి కేవలం 'ప్రపంచంలోని కణకణంలో ఈశ్వరుడు వ్యాపించి ఉన్నాడని చెప్పటంతో తృప్తి పడలేదు.' అందుకని ఇంకా ఇలా చెప్పారు: "ఈశ్వరుడు సర్వ వ్యాపి. అందువల్ల ఇక్కడ ఏ వస్తువు మీద చివరకు మీ శరీరం మీద కూడా మీకు అధికారం లేదు. మీ దగ్గర ఉన్నదానికంతకూ ఈశ్వరుడే నిర్వివాదమైన ప్రభువు." అందుకనే తాను హిందువునని భావించే ప్రతి వ్యక్తి 'ద్విజత్వం'-క్రైస్తవుల పదజాలంలో చెప్పాలంటే 'నూతన జన్మ'-పొందేందుకు అంత వరకూ అజ్ఞానవశాత్తు తనవని అనుకుంటున్న వస్తువులన్నిటినీ ఈశ్వరార్పణం చేసి పరిత్యజించాలి. అలా ఈశ్వరార్పణం లేక త్యాగం చేసిన తర్వాత దానికి ప్రతిఫలంగా లేక పారితోషికంగా అతనికి కావలసిన అన్న వస్త్రాలు, ఆశ్రయం లభించేందుకు ఈశ్వరుడు అన్ని ఏర్పాట్లూ చేస్తాడు. కాబట్టి జీవితంలో అవసరమయిన వస్తువులను అనుభవించేందుకు వాటిని ఈశ్వరార్పణం చేసి త్యజించి తీరాలి. ఈ సమర్పణ లేక త్యాగం ప్రతి రోజూ చెయ్యాలి. లేకుంటే ఈ ప్రాపంచిక మాయా మోహంలో పడి మనం అతి ముఖ్యమైన విషయాన్ని మరచి పోవచ్చు. ఇదంతా చెప్పిన

30.1.1937, పుటలు 322-324, సంపుటం 64, గాంధీ వాఙ్మయం

తర్వాత మంత్ర ద్రష్ట అయిన మహర్షి 'ఎవరి ద్రవ్యాన్నీ లోభ దృష్టితో చూడకు' అని చెప్తాడు. నేను మీకు చెప్పదలచుకున్నది ఏమంటే ఈ చిన్న మంత్రంలో ఇమిడి ఉన్న సత్యం ప్రతి మనిషిలో ఉండే అత్యుత్తమమయిన ఇహపర కాంక్షలను తీర్చ గలదు. ప్రపంచంలోని మత గ్రంథాలలో సత్యాన్ని అన్వేషించగా ఈ మంత్రంలో చేర్చవలసిన విషయం నాకు ఏమీ స్ఫురించలేదు. మత గ్రంథాలను కొద్దో గొప్పో నేను అధ్యయనం చేసినంత వరకూ నా అధ్యయనం చాలా పరిమితమని నాకు తెలుసు-అన్ని గ్రంథాలలో చెప్పబడ్డ మంచి మంచి విషయాలన్నీ ఈ మంత్రం నుంచే ఉద్భవించి ఉన్నాయని నాకు అనిపించింది. విశ్వ బంధుత్వం-కేవలం విశ్వ మానవ బంధుత్వమే కాదు, జీవకోటి బాంధవ్యం కూడా-ఈ మంత్రంలోనే చూడవచ్చు. జగత్పతి అనండి, లోక నాయకుడనండి, మరేమయినా అనండి-ఆ ప్రభువుపై నిశ్చలమైన శ్రద్ధ ఏర్పడాలంటే నాకది ఈ మంత్రంలోనే లభించింది. ఈశ్వర చరణాలలో సర్వస్వం సంపూర్ణంగా సమర్పణ చేసి మన అవసరాలకు ఆయనమీదనే ఆధారపడి ఉండేందుకు తగిన మనస్థితిని దర్శించాలంటే నాకు ఆ సందర్శనం-మరోసారి చెప్తున్నాను-ఈ మంత్రం ప్రసాదిస్తుంది. ఈశ్వరుడు మన అందరి రోమ కూపాల్లో, అణువణువులో ఉచ్ఛ్వాస నిశ్వాసాల్లో అంతటా వ్యాపించి ఉన్నాడు కనుక ఈ మంత్రంలోనుంచి నేను ప్రపంచంలోని సమస్త జీవరాశిలో కనిపించే సమతా సిద్ధాంతాన్ని నిష్పన్నం చేస్తాను. అందువల్ల సర్వ సమానత్వాన్ని తమ మనస్సులో ప్రతిష్ఠించుకున్న వాళ్ళ అందరి ఆకాంక్షలూ ఈ మంత్రంతో సంతృప్తి చెందుతాయి. ఈశ్వరుడికి చెందిన వస్తువును-అది ఏదయినా సరే దాన్ని నేను తనదిగా భావించుకొని తన దగ్గరనే ఉంచుకోవటం సాధ్యం కాదు-అని ఈ మంత్రం నాకు చెప్తుంది. నా జీవితం, ఆ మాటకు వస్తే ఈ మంత్రం మీద నమ్మకం ఉన్న ఎవరి జీవితమైనా సరే-ఈశ్వరార్పితం కావాలంటే ఆ జీవితం జీవకోటిని నిరంతరం సేవించే జీవితంగా రూపొందాలని ధృఢపడుతుంది.

ఇదీ నా శ్రద్ధ. తాను హిందువునని భావించే ప్రతి వ్యక్తిలో ఈ శ్రద్ధ ఏర్పడాలి. నా క్రైస్తవ, మహమ్మదీయ సోదరులకు కూడా నేను ఇదే మాట చెప్పేందుకు సాహసిస్తాను. వాళ్ళు తమ తమ మత గ్రంథాలను తిరగేసి చూస్తే ఇంతకు మించిన తత్త్వం వాటిలో మరేమీ కనిపించదు. తిరువాంకూరులోని హిందువులు ఈ మంత్రంలో ఇమిడి ఉన్న ఉన్నత ఆదర్శాన్ని ప్రత్యక్ష సత్యం చేయాలనీ, అందుకు ప్రపంచంలోని

ప్రజలందరూ-మహమ్మదీయులు కానియ్యండి, క్రైస్తవులు కానియ్యండి, మరి ఇంకెవరైనా కానియ్యండి-సహకరించాలి. హిందూ మతం పేరిట ప్రచారంలో ఉన్న మూఢ నమ్మకాలను గురించి తెలియకపోలేదనే విషయం దాచటం నాకు ఇష్టం లేదు. హిందూ మతం పేరిట ప్రచారంలో ఉన్న అంధ విశ్వాసాలను గురించి నాకు పూర్తిగా తెలుసు. వాటిని చూస్తుంటే నాకు బాధగా ఉంటుంది కూడా. దొంగను దొంగ అనేందుకు నేను జంకను. అంటరానితనం దారుణమైన అంధ విశ్వాసమని చెప్పేందుకు నేను ఎన్నడూ వెనుదీయలేదు. కాని ఇన్ని మూఢ నమ్మకాలతో కూడుకొని ఉన్నా నేను హిందువుగానే నిలబడి ఉన్నాను. కారణం ఈమూఢ నమ్మకాలు హిందూ మతంలోని భాగాలు కావని నా నమ్మకం. హిందూ మతంలో-మత గ్రంధాలను వ్యాఖ్యానించేందుకు ఏర్పరచిన ప్రణాళికననుసరించి నేను నేర్చుకున్నదేమంటే-ఏ సత్యాన్ని నేను ప్రతిపాదిస్తున్నానో, ఏ సత్యం ఈ మంత్రంలో ఇమిడి ఉన్నదో దానికి అనుగుణం కాని విషయాన్ని-అది హిందూ మతంలో ఒక భాగం కాదని చాటి చెప్పి-పూర్తిగా పరిత్యజించేందుకు నేను సందేహించను-సందేహించకూడదు.



19

# యజ్ఞం

ఈ లోకంలో కానీ, పరలోకంలో కానీ ప్రతిఫలమేమీ కోరకుండా, గ్రహించకుండా కేవలం పరమార్థంకోసం చేసే కర్మ ఏదయినా సరే అది యజ్ఞం అనబడుతుంది. కర్మ శారీరకం కావచ్చు, మానసికం కావచ్చు, వాచికమైనా కావచ్చు. అతి విశాలమైన అర్థంలో దాన్ని గ్రహించాలి. 'పరమార్థం కోసం' అంటే కేవలం మానవ జాతినే కాక సమస్త జీవకోటినీ అందులో చేర్చుకోవాలి. అహింస దృష్ట్యా కూడా, మానవ సేవను మనస్సులో పెట్టుకొని చూచినా ఇతర జీవులను బలి ఇవ్వటం, వాటిని నిలువునా చంపటం యజ్ఞం క్రింద పరిగణింప బడదు.

వేదాదులలో గుఱ్ఱాలను, గోవులను బలి ఇచ్చే విషయం మనం విపరీతంగా అర్థం చేసుకున్నాం. ఒక వేళ దాన్ని మనం జీవ హింసగా భావిస్తే అది సత్యం-అహింసతో మనం కూర్చుకున్న తక్కెడలో సరి తూగదు. మనకు అంత వరకే చాలు. మతం పేరిట ప్రసిద్ధికెక్కిన వాక్యాలను చారిత్రికంగా పరామర్శించు కొన్నందు వల్ల అనవసరమయిన చిక్కుల్లో ఇరుక్కొని పోతాం. అలాంటి అన్వేషణకు కావలసిన సామర్థ్యం కూడా నాకు లేదని సంతోషంగా ఒప్పుకుంటాను. అలాంటి యోగ్యత సంపాదించుకోవాలని కూడా నాకు లేదు. కారణం, చారిత్రికంగా జీవహింస సమంజసమని రుజువయినా కూడా అహింసను పరమ ధర్మంగా భావించే మనకు ఆ వాక్యార్థం రుచించదు, కాబట్టి అలాంటి ఆచారం కూడా త్యాజ్యం.

ఈ వ్యాఖ్యా పద్ధతిలో ఆలోచించినప్పుడు మనకు బోధ పడేది ఇది: ఏ కర్మను ఆచరించినందు వల్ల ఎక్కువమందికి ఎక్కువ భూభాగంలో మంచి చేకూరుతుందో, ఏ పనిని ఎక్కువ మంది తక్కువ శ్రమతో మిక్కిలి నైపుణ్యంతో చేయగలరో, ఎందులో ఎక్కువ సేవకు

పుటలు 240 - 241, 257-259, సంపుటం 44, గాంధీ వాఙ్మయం

అవకాశం ఉంటుందో అదే మహా యజ్ఞం, మంచి యజ్ఞం. కాబట్టి ఒకరిని సేవించేందుకు మరొకరికి కీడు తలపెట్టడం, చెయ్యడం యజ్ఞం కానేరదు. యజ్ఞం కానిది కర్మ బంధానికి కారణం అవుతుందని 'భగవద్గీత' మనకుచెప్తుంది. అనుభవం కూడా అదే బోధిస్తుంది.

అలాంటి యజ్ఞం లేకుండా ఈ ప్రపంచం ఒక్క క్షణం కూడా నిలబడలేదు. అందుకనే గీతాచార్యులు రెండవ అధ్యాయంలో జ్ఞానాన్ని గురించి చూ చాయగా చెప్పి మూడవ అధ్యాయంలో ఆ జ్ఞానాన్ని సంపాదించేందుకు చేయవలసిన సాధనలో మనల్ని ప్రవేశ పెడతారు. యజ్ఞాన్ని మనం జన్మతోనే వెంట తీసుకొని వచ్చామని ఆయన స్పష్టంగా చెప్పారు. నిజానికి మనకీ శరీరం పరమార్థ సాధనకు లభించింది, కాబట్టి యజ్ఞం చేయకుండా తిన్న తిండి దొంగ తిండి అవుతుందని గీతాచార్యులు కటువుగా అనేశారు. పరిశుద్ధమైన జీవితం గడుపు దామనుకున్న వాళ్ళు చేసే ప్రతి పనీ యజ్ఞంగానే రూపొందుతుంది. యజ్ఞంతోనే మనం జన్మించామంటే మనం పుట్టుక తోనే ఋణ పడి పుట్టామని అర్థం. కాబట్టి మనం సర్వదా లోక సేవకులమే. యజమాని తన సేవకులకు వాళ్ళు చేసే సేవకు ప్రతిఫలంగా అన్న వస్త్రాదులు ఇచ్చినట్టే జగత్ ప్రభువు మనచేత పని చేయించుకునేందుకు మనకిచ్చే అన్న వస్త్రాదులను మనం కృతజ్ఞతతో స్వీకరించాలి. మనకు లభించేది మన హక్కును బట్టి లభిస్తున్నదని భావించకూడదు. ఒకవేళ లభించకపోతే యజమానిని దూషించకూడదు కూడా. ఈ శరీరం ఆయనదే. ఆయన కావలిస్తే పోషిస్తారు. లేకుంటే లేదు. ఇది కష్ట ప్రదమైన పరిస్థితి కాదు. దానికోసం దిగులు పడవలసిన పని లేదు. మన స్థితి మనం అర్థం చేసుకుంటే అది సహజంగానే ఉంటుంది. సుఖంగా సుముఖంగా ఉన్నట్టు అనిపిస్తుంది. అలాంటి ఆత్యంతిక సుఖాన్ని అనుభవించేందుకు అచంచలమైన శ్రద్ధ అవసరం. తనను గురించి ఏమీ విచారించకుండా అంతా పరమేశ్వరుడికి వదలివెయ్యాలని అన్ని మతాలూ ఆదేశించినట్టు నేను గమనించాను.

కాని అంత మాత్రాన కలవర పడ వలసిన పని లేదు. నిర్మలమైన మనస్సుతో సేవా కార్యం ఆరంభిస్తే అలాంటి సేవ ఎంత అవసరమో తెలుస్తుంది. శ్రద్ధ కూడా హెచ్చుతుంది. స్వార్థాన్ని వదలి పెట్టేందుకు సిద్ధం కాలేని వాడు తన జన్మ కర్మలను గుర్తించలేడు. సేవకు సంబంధించిన దారులన్నీ అతనికి దుర్గమంగా తోస్తాయి. అతని సేవా వ్యాసంగంలో స్వార్థం అడుగడుగునా దుర్వాసనలు చిమ్ముతూనే

ఉంటుంది. కాని అలాంటి స్వార్థపరాయణులు ప్రపంచంలో తక్కువగానే ఉంటారు. నిస్వార్థమైన సేవ మనమందరం కొద్దో గొప్పో తెలిసో తెలియకో చేస్తూనే ఉంటాం. అదేపని బుద్ధిపూర్వకంగా చేస్తే మన పారమార్థిక సేవా వృత్తి ఉత్తరోత్తరా వృద్ధి చెందుతూ ఉంటుంది. అందులోనే మనకు నిజమైన సుఖం లభిస్తుంది. లోక కల్యాణం కూడా అందులోనే ఉంది. ఎవరో కొందరు సాధువులు మాత్రమే తమ ద్రవ్యాన్ని 'పరోపకారార్థం' లేదా రమ్యంగా చెప్పాలంటే 'సేవార్థం' వినియోగిస్తారని భావించ రాదు. ప్రతి వ్యక్తి సొత్తూ కూడా సేవార్థం ఏర్పడ్డదే. అలా అయినప్పుడు జీవితంలో భోగ లాలస అంతరించి త్యాగ బుద్ధి పెరుగుతుంది. మనిషి త్యాగం చేసే భోగాన్ని అనుభవిస్తాడు. పశువులకు, మనుష్యులకు జీవితంలో ఉండే భేదమిదే. అదే జీవిత చరితార్థమైతే జీవితం నీరసించి కళా రహితమైపోతుంది. గార్హస్థ్య జీవితం నిష్ఫలమైపోతుంది-అని కొందరు విమర్శకులు సేవాపరాయణతను దోషపూరితమని భావిస్తారు. కాని అలా భావించటం త్యాగాన్ని అపార్థం చేసుకోవటం అవుతుందని నా అభిప్రాయం. త్యాగమంటే ప్రపంచాన్ని వదలి అడవుల్లో ఉండటం కాదు. నిత్యజీవితంలో త్యాగాన్ని ప్రసరింప చేయాలి. ఒక గృహస్థుడి జీవితం త్యాగమయం కావచ్చు, భోగమయమూ కావచ్చు. చెప్పులవాడు చెప్పులు కుట్టటం, రైతు వ్యవసాయం చేసుకోవటం, వర్తకులు వ్యాపారం చెయ్యటం, మంగలి క్షుర కర్మ చేయటం-ఇవన్నీ త్యాగ బుద్ధితో చేయ వచ్చు, లేదా భోగ లాలసతో కూడా చేయ వచ్చు. వ్యాపారాన్ని యజ్ఞ భావంతో చేసేవాడు కోట్ల కొలది వ్యాపారం చేస్తూ లోక సేవ కూడా సాధించ వచ్చు. అలాంటి వాడు ఎవరినీ మోసం చెయ్యడు. పోటీ పడి నష్ట పడడు, కోటీశ్వరుడైనా నిరాడంబరంగా ఉంటాడు, ఎంత లాభం సంపాదించినా ఇతరులకు హాని చెయ్యడు. తాను నష్ట పడ్డా ఇతరులకు కీడు తలపెట్టడు. అలాంటి వ్యాపారి నా కపోల కల్పన లోనే కనిపిస్తాడని ఎవరైనా నవ్వుకోవచ్చు. కాని ప్రపంచం చేసిన పుణ్యం వల్ల అలాంటి వ్యాపారులు ప్రాక్పశ్చిమాల్లో అంతటా ఉన్నారు. అలాంటి వాళ్ళు వేళ్ళ మీద లెక్క పెట్ట గలిగినంత తక్కువ మందే కావచ్చు. కాని అలాంటి వాడు ఒక్కడు జీవించి ఉన్నా అది కల్పన కాదని తేలుతుంది. అలా లోకోపకారం కోసం దర్జీ పని చేసే ఒక వ్యక్తిని మీరు బఢ్వాణ్‌లో చూచారు. అలాంటి మంగలి నాకు తెలుసు. అలాంటి నేత పని చేసే వ్యక్తి మనకందరకూ తెలుసు. వెదకి చూస్తే అన్ని వృత్తులలో ఇలాగే కేవలం యజ్ఞ భావంతో తమ తమ వృత్తి ధర్మం నిర్వహించి తదీయ

భావంతో జీవితం సాగించే వ్యక్తులు మనకు దొరుకుతారు. ఇలాంటి యాజ్ఞకులు తమ వృత్తిని జీవనోపాధికి మార్గంగా ఉపయోగించు కుంటారనేది నిజమే. కాని జీవనోపాధి కోసం వాళ్ళు వృత్తిని నిర్వహించరు. జీవనోపాధి వాళ్ళకు వృత్తి వల్ల లభించే ఆనుషంగిక ఫలితం. మోతీలాల్ అంతకు ముందు కూడా దర్జీ పని చేసే వాడు. జ్ఞానోదయం అయిన తర్వాత కూడా అతను దర్జీ పని చేసాడు. భావ పరివర్తన తర్వాత వృత్తి యజ్ఞంగా మారింది. అందులో పవిత్రత ప్రవేశించింది. వృత్తితోబాటు పర సుఖ భావన కూడా మిళితమయింది. దానితో అతని జీవితం కళాత్మకమయింది. యజ్ఞమయమైన జీవితం పరాకాష్ఠ నందుకున్న కళలాంటిది. నిజమైన ఆనందం అందులోనే ఉంది. కారణం, రసనిర్ఝరిణి అందులోనుంచే స్రవిస్తుంది. ఆ రసాస్వాదన అమృతాయమానమయింది. ఆ సెలయేటికి ఇంకిపోవటం అనేది లేదు. యజ్ఞం భారం అనిపిస్తే అది యజ్ఞం కాదు. ఏవగింపు కలిగించేది త్యాగం కాదు. భోగం వినాశానికి దారి తీస్తుంది. త్యాగం అమరత్వానికి దారి చూపుతుంది. రసం స్వతంత్రమైన పదార్థం కాదు. అది మన మనోవృత్తిలో ఉంటుంది. కొందరికి తెరపై నాటకం చూడడం లో ఆనందం, మరి కొందరు ఆకాశంలో నిత్యం కనిపించే చిర నవీన దృశ్యాలకు మురిసిపోతారు. రసం పరిశీలనకు చెందింది. రస స్వరూపంగా బాల్య కాలంలోనే మనం అలవరచుకున్నది. ఆ స్వరూపంలోనే ప్రజలకు ప్రసాదించబడింది, అదే రసంగా రూపొందుతుంది. ఒక జాతికి రసమయమని తోచేది మరో జాతికి రసహీనంగా తోచవచ్చు. ఇలాంటి ఉదాహరణలు ఎన్నయినా కనిపిస్తాయి.

యజ్ఞ భావంతో పని చేసే సేవకులు చాలామంది నిష్కామ భావంతో పని చేస్తారు. అందువల్ల ప్రజలనుంచి మన అవసరం కొద్దీ అవసరం లేకపోయినా ఏదంటే అది తీసుకునేందుకు మనకు అధికారం లభించిందని భావించ రాదు. సేవా భావం పోయి రాజ స్వభావం ఏర్పడకూడదు. సేవా వృత్తిలో తన సౌకర్యాన్ని గురించి ఆలోచించేందుకు ఆస్కారమే లేదు. సేవకుల సౌకర్యం యజమాని అంటే భగవంతుడు చూస్తాడు. ఏమి ఇవ్వాలో అది ఇస్తాడు. ఆ విషయం తెలుసుకుని సేవకుడు కూడా వచ్చిందంతా పోగు చేసుకుని తన స్వంతం చేసుకోకుండా కావలసిన వరకే తీసుకుని మిగిలినది వదలి పెట్టాలి. ఒక వేళ కావలసిన సౌకర్యం లభించకపోయినా శాంతిగా సహనంగా ఉండాలి. రోషపడకూడదు. మనస్సులోకూడా కష్టపడకూడదు యాజ్ఞికుడికి లభించే పారితోషికం,

సేవకుడి శ్రమ ఫలం. అంతటితో తృప్తి చెందాలి.

సేవా కార్యంలో వెట్టి చాకిరీ అనే భావం రాకూడదు. చివరిదాకా వాయిదా వేయకూడదు. తన పని తాను చెయ్యాలి. ఇతరుల పని కూడా నిస్వార్థంగా, నిష్ఠగా చెయ్యాలి. ఎప్పుడు తీరితే అప్పుడు ఎలా చేయగలిగితే అలాచేద్దాంలే అని అనుకునే వ్యక్తికి యజ్ఞం అంటే ఏమిటో బొత్తిగా తెలియదన్నమాట.సేవా వృత్తిని అందంగా, ఆనందంగా నిర్వహించాలి. తనకున్న కళా నైపుణ్యం, శృంగార కౌశలం, అంతా సేవకై వినియోగించాలి. ముందు స్వామి కార్యం, తరువాత స్వకార్యం. సారాంశం ఏమంటే, శుద్ధమైన మనస్సుతో యజ్ఞ భావంతో పని చేసే వాడికి తనదంటూ ఏమీ ఉండదు. అంతా 'కృష్ణార్పణం!'



20

## హిందూ మతం మనకు ఏం చేసింది?

ఈ నాడు మనం చూస్తున్న హిందూ మతం అసలైన హిందూ మతం కాదు. అప్పుడప్పుడు అది వికారాకృతిలో కనిపిస్తుంది. అలా కాకుంటే నాకు దానిని సమర్థిస్తూ చెప్పవలసిన అవసరం ఉండేది కాదు. దానంతట అదే అందులోని సత్యం పలికేది. అది ఎలాగంటే, నేను పూర్తిగా పవిత్రాత్మను అయి ఉంటే నేను చెప్పుకోవలసిన అవసరం ఉండదు. భగవంతుడు నోరు తెరచి ఏమీ చెప్పడు, మానవుడు భగవంతుడికి ఎంత సమీపం అవుతాడో అతనిలో అంత భగవత్తత్త్వం ఉంటుంది. నా దేహం వాలో నివసించి ఉన్న ఆత్మ శక్తికి ఎల్లలను సూచిస్తుందని హిందూ మతం నాకు బోధిస్తుంది.

పాశ్చాత్య దేశాల్లోని ప్రజలు భౌతిక రంగంలో ఆశ్చర్యకరమైన ఆవిష్కరణలు చేసినట్టుగానే హిందూ మతం ఆధ్యాత్మిక రంగంలో ఆత్మను గురించీ, మతాన్ని గురించీ అంతకు మించి ఆశ్చర్యకరమైన ఆవిష్కరణలు చేసింది. కాని, ఈ మహత్తరమైన, మనోహరమైన ఆవిష్కరణలను సాక్షాత్కరించుకునేందుకు చాలిన నయనాలు లేవు. పాశ్చాత్య విజ్ఞానంలో జరిగిన అభ్యుదయాన్ని చూచి మన కళ్ళు మిరుమిట్లు చెందాయి. ఒక విధంగా చూస్తే భారత దేశాన్ని ఈ రంగంలో అభ్యుదయం సాధించకుండా దైవం కావాలని అరికట్టినట్లు తోస్తుంది. అందువల్ల ఈ దేశానికి భౌతిక వాదంలో చెలరేగిన ఝుం ఝూ మారుతాన్ని ఎదుర్కొనే ప్రత్యేకమైన బాధ్యత అప్పగించినట్టయింది. ఏది ఎలా ఉన్నా, హిదూ మతం ఇంత వరకూ సజీవంగా నిలబడి ఉన్నదంటే దానిలో ఏదో కొంత విశేషం ఉండి తీరాలి. బ్యాబిలోనియా,

---

24.11.1927, పుటలు 544- 545, సంపుటం 35, గాంధీ వాఙ్మయం

సిరియా, పర్షియా, ఈజిప్టు, నాగరికతలు పతితమైపోవటాన్ని ఈ మతం తన కళ్ళ ఎదుట చూచింది. ఒక సారి మనం నలు వైపుల మన దృష్టి ప్రసరించి చూస్తే తెలుస్తుంది. రోమ్ ఎక్కడ? గ్రీసు ఎక్కడ ఉంది? గిబ్బన్ వర్ణించిన ఇటలీ ఈనాడు మీకు ఎక్కడైనా కనిపిస్తున్నదా? ప్రాచీన రోమ్-దానినే ఇటలీ అనే వాళ్ళు. గ్రీకు వెళ్ళండి, అక్కడ ప్రసిద్ధికెక్కిన అటిక్ నాగరికత ఏమయింది? మరి భారతదేశం చూడండి. ఇక్కడ ప్రాచీన శిలాలేఖలను, కుడ్య లేఖలను, చారిత్రిక శిథిలావశిష్టాలనూ చూడండి. ఆ తర్వాత నలు దిక్కులా దృష్టి మరల్చండి. అప్రయత్నంగా మీకు "అవును, ప్రాచీన భారత దేశం ఈనాటికీ జీవించి ఉంది" అనాలని అనిపిస్తుంది. అక్కడక్కడా పేడ దిబ్బలు కనిపించే మాట నిజమే. కాని, వాటి క్రింద అమూల్యమైన నిధులు అణగిపడి ఉన్నాయి. ఇవన్నీ శేషించి, జీవించి ఉండటానికి కారణం ఏమిటి? హిందూ మతం భౌతిక రంగంలో కాక ఆధ్యాత్మిక మార్గంలో పురోగమించటం తన లక్ష్యంగా పెట్టుకుంది.

హిందూ మతం మనకు ప్రసాదించిన అనేక గుణగణాలలో ఒకటి -నోరు లేని జీవులతో మనుష్యుడు ఏర్పరచుకున్న అవినా భావ సంబంధం. నా దృష్టిలో గో పూజ చాలా గొప్ప విషయం. దీన్ని ఇంకా విస్తరించ వచ్చు. ఈనాటి మతం మార్పిడి నుంచి హిందూ మతాన్ని దూరంగా ఉంచటం కూడా బహు మూల్యమైన పరిపాటి. హిందూ మతాన్ని ప్రచారం చెయ్య వలసిన అవసరం లేదు. ప్రత్యేకంగా నీతి బోధలు చెయ్య వలసిన అవసరం కూడా లేదు. 'జీవన యాత్ర చెయ్యండి' అని మాత్రమే ఈ మతం చెబుతుంది. నీ పని నీవు చేస్తూ జీవించు, నా పని నేను చేస్తూ జీవిస్తాను. ఆతర్వాత కాలాన్ని మన ఆచరణ ఎలా మారుస్తుందో చూద్దాం. ఒకసారి మతం మనకు అనుగ్రహించిన మహనీయులను చూడండి. అత్యాధునిక కాలాన్ని వదలి వేసినా రామానుజులు, చైతన్యులూ, రామ కృష్ణులు-మొదలైన వారు హిందూ మతం మీద తమ ముద్ర వేశారు. ఏ విధంగా చూచినా హిందూ మతం మృత ప్రాయమైన శక్తి కాదు, మృత మతం కూడా కాదు.

ఆశ్రమ ధర్మం హిందూ మతం మనకు ప్రసాదించిన విలక్షణమైన జీవన పద్ధతి. ఇలాంటిది ప్రపంచంలో మరొక్కటి లేదు. కాథలిక్కులలో వివాహం చేసుకోని వాళ్ళ సముదాయం ఒకటి ఉంది. కాని, అది ఒక వ్యవస్థగా ప్రచారంలో లేదు. భారత దేశంలో ప్రతి బాలుడూ బ్రహ్మచర్యం పాటించి తీరుతాడు. ఇది తొలి ఆశ్రమం. ఎంత చక్కని పరి కల్పన!

ఈ నాడు మన కళ్ళు కలుషితమై పోతున్నాయి, ఆలోచనలు అంత కంటే కలుషితమైపోతున్నాయి, తనువులు అన్నింటికంటే కలుషిత మౌతున్నాయి. కారణం, మనం హిందూ మతాన్ని నిరాకరిస్తున్నాం.

మరో విషయం, నేను చెప్పటం మరిచాను. మ్యాక్స్‌ముల్లరు నలభై సంవత్సరముల క్రిందట అన్నారు: "యూరప్ నివాసులు పునర్జన్మ అనేది కేవలం ఒక సిద్ధాంతం కాదనీ, అది యదార్ధమైన తథ్యమని మెల్ల మెల్లగా అర్థం చేసుకుంటున్నారు. ఈ చింతన పూర్తిగా హిందూ మతం మనకు ప్రసాదించిన ధీనిధి."

ఈ నాడు వర్ణాశ్రమ ధర్మాలనూ, హిందూ మతాన్నీ వాటిని పాటించే వాళ్ళే తప్పు ధోరణిలో వ్యాఖ్యానిస్తున్నారు. వాటిని నిరాకరిస్తున్నారు. ఈ ఆచారాలను నిర్మూలించటం వల్ల లాభం లేదు, వాటిలోని దోషాలను తొలగించి మంచిని పెంచటమే శ్రేయస్కరం. హిందూ మతాన్ని గురించి మనం మన అంతరంగంలో మంచి భావనలు వెలయించుకొని చూడాలి- అది మన ఆత్మ తుష్టికి సహకరిస్తుందా, లేదా అని.

## 21

# కాంగ్రెసు-భగవంతుడు

నా సత్యం నా దైవం. నా ప్రేమ నాకు భగవంతుడు. నీతి, సదాచారం భగవత్స్వరూపం. నిర్భయత్వం దైవ స్వరూపం. భగవంతుడు జీవితానికీ, వెలుగుకూ మూలం. అయినా భగవంతుడు వీటన్నిటికీ అతీతుడు. అంతరాత్మే పరమాత్మ. నాస్తికులలోని నాస్తికత కూడా అతడే. ఎందుకంటే ఎనలేని ప్రేమతో అతడు వాళ్ళని కూడా బ్రతుకనిస్తాడు. అతడు హృదయాన్ని గమనిస్తాడు. బుద్ధికీ, వాక్కుకూ అతడు అతీతుడు. మనకు మనల్ని గురించి ఎంత తెలుసునో, అంతకు మించి అతనికి మనల్ని గురించీ, మన హృదయాల్ని గురించీ తెలుసు. మనం చెప్పింది చెప్పినట్లు అతడు నమ్మడు. కారణం, సామాన్యంగా మనం మన మనస్సులో ఉన్నమాటనే బయటకు చెప్పమని అతనికి తెలుసు. కొందరు తెలిసి అలా చేస్తారు, కొందరు తెలియక చేస్తారు. వాళ్ళ దృష్టిలో భగవంతుడు ఒక వ్యక్తి మాత్రమే. వ్యక్తిగానే అతన్ని వాళ్ళు తమ ఎదుట చూడాలని అనుకుంటారు. అతని స్పర్శకోరే వాళ్లకు అతడు ఆకారంతో కనిపిస్తాడు. పరమ పావనమైన తత్త్వమే భగవంతుడు. శ్రద్ధ కలవాళ్ళకే అతని ఉనికి ఉంది. వేరు వేరు వ్యక్తులకు వేరు వేరు రూపాలలో అతడు కనిపిస్తాడు. అతడు మనలో వ్యాపించి ఉన్నాడు. కాని మనకు అతీతుడు. 'దైవ' మనే పదాన్ని కాంగ్రెసునుంచి వేరు చేయవచ్చు. కాని దైవాన్ని మాత్రం ఎవరూ ఎక్కడనుంచి తొలగించలేరు. భగవంతుని పేరిట చేసే ప్రతిజ్ఞ - అసలు ప్రతిజ్ఞ అనేది పదార్థమే కాకపోతే ప్రతిజ్ఞకు ప్రసక్తే లేదు. అంతరాత్మ అనేది భగవంతుడికి బలవంతంగా ఆరోపించిన

---

5.3.1925, పుటలు 218-219, సంపుటం 26, గాంధీ వాఙ్మయం

చాలీ చాలని పర్యాయ పదం. ఆ పేరిట భయంకరమైన అవినీతి కృత్యాలు, అమానుషమైన అత్యాచారాలు జరిగాయి. అయినా అతని అస్తిత్వం మాత్రం అంతరించదు. అతనికి చాలా ఓర్పు ఉంది. ఓపిక ఉంది. కాని అతడు ప్రచండుడు కూడాను. ఈలోకంలోనూ, ఇకముందు రానున్న లోకంలోనూ ఎంత పనినైనా సాధించగల శక్తి అతనిలో ఉంది. మనం మన తోటి వాళ్ళ చేతనూ పశువుల చేతనూ ఎలా పని చేయిస్తూ ఉంటామో అలాగే అతడు మనచేత చేయిస్తాడు. నాకు తెలియదని తప్పించుకోటం అతని దగ్గర సాధ్యం కాదు. అయినప్పటికీ అతడు దయామయుడు. మనకు పశ్చాత్తాపం కలిగేందుకు అతడు అవకాశం ఇస్తాడు. ప్రపంచంలో అతనిని మించిన ప్రజాతంత్ర పరాయణుడు లేడు. మంచి-చెడు తెలుసుకుని ప్రవర్తించేందుకు మనకు పూర్తి స్వాతంత్ర్యాన్ని కల్పిస్తాడు. అతడు పచ్చి మోసంకూడా చేస్తాడు. నోటికి అంది వచ్చిన ఆహారాన్ని హరిస్తాడు. స్వేచ్ఛా స్వాతంత్ర్యం చాటున చనువుకు ఆస్కారం చాలా తక్కువ ఇస్తాడు. మనం నిరుపాయులమని తెలుసుకుని పరిహాసం చేస్తాడు. హిందూ మతం దీన్ని అతని లీలగా, మాయగా భావిస్తుంది. మనం ఎందుకూ పనికి రాము. అంతా అతనే, పూర్తిగా అతనిదే ఇదంతా. మనం కేవలం అతని గుణ గణాలను కీర్తిస్తూ ఉండ వలసిందే. అతని కోరిక ప్రకారం నడుచుకోవలసిందే. కాబట్టి రండి, అతని మురళీ గానానికి మురిసిపోయి నృత్యం చేద్దాం. అంతా మన మంచికే.



22

# మూడు ముఖ్యమైన ప్రశ్నలు

ఒక పెద్ద మనిషి చాలా వినయంతో మూడు ప్రశ్నలు హిందీలో అడిగారు.

(1) వర్ణ భేదం జన్మజాతమని మీ నమ్మకం. కాని ఏ వ్యక్తి అయినా ఏ పనినయినా చేయ వచ్చుననీ, బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులలోని ద్విజత్వం ఏ వ్యక్తిలోనయినా రావచ్చునని కూడా మీరు నమ్ముతారు. అలాంటప్పుడు వర్ణ నిరూపణ యొక్క అవసరం ఏమిటి? కేవలం జన్మతోనే ఆ పేరు ఎందుకు రావాలి. జన్మకు అంత ప్రాధాన్యం ఎందుకు?

(2) మీరు అద్వైత వాదాన్ని అంగీకరిస్తారు. కాని సృష్టి అనాది, అనంతం, సత్యం అని కూడా భావిస్తారు. అద్వైత వాదం సృష్టి అస్తిత్వాన్నే నిరాకరిస్తుంది. మీరు ద్వైతులు కూడా కారు. కారణం, జీవాత్మకు స్వతంత్రమైన కర్తృత్వం ఉందని మీరు విశ్వసిస్తారు. అలాంటప్పుడు మిమ్మల్ని అనేకాంత వాదులని కానీ, స్యాద్వాదులని కానీ భావించడం ఎందుకు సమంజసం కాకూడదు?

(3) దేవుడంటే దేహ రహితుడు, వీతరాగి, స్వతంత్రుడు, నిరుపాధికుడు అని మీరు చాలా పర్యాయాలు వ్రాశారు. అంటే దేవుడు ప్రపంచాన్ని సృష్టించలేదు. పాప పుణ్యాల నిర్ణయంతోకూడా అతనికి ప్రసక్తి లేదు. అయినా మీరు మాటి మాటికీ ఈశ్వరేచ్ఛ అని అంటుంటారు. ఉపాధి రహితుడైన ఈశ్వరుడికి ఇచ్ఛ ఎలా ఉంటుంది? ఆ ఈశ్వరేచ్ఛకు మీరు

21.1.1926, పుటలు 401-403, ఖండం 29, గాంధీ వాఙ్మయం

ఎలా విదేయులై ఉంటారు? మీ ఆత్మ ఏమి చెయ్యాలనుకుంటే అది చెయ్య గలదు. అలా చెయ్యలేక పోతే పురాకృత కర్మ దానికి కారణం కాని, దైవం కాదు. మీరు సత్యాగ్రహం చేసేవారు కాబట్టి కేవలం మూఢాత్ములకు తెలియజెప్పేందుకు మీరిలా అసత్యం పలుకుతున్నారని అనుకోవాలా? లేకుంటే ఈశ్వరేచ్ఛ, దైవాధీనంలాంటి మాటలెందుకు?

(1) సృష్టి నియమాలను బలపరచేందుకే నేను వర్ణ భేదాన్ని అంగీకరించటం. మనకు మన తల్లిదండ్రుల గుణ దోషాలు కొన్ని పుట్టుకతోనే వంశపారంపర్యంగా సంక్రమిస్తాయి. మనుష్య యోనిలో మనుష్యులే పుడతారు. ఇది జన్మను బట్టే వర్ణ భేదం నిర్ణయమౌతుందని తెలియ పరుస్తుంది. పుట్టుకతో వచ్చిన గుణ దోషాలను మనం కొంత వరకూ మార్చుకోగలం. ఈ దృష్టితో చూస్తే కర్మకు కూడా ప్రాధాన్యం ఉంది. పూర్వ జన్మలో ఆర్జించుకున్న సంస్కారాలను ఒకే జన్మలో పూర్తిగా రూపుమాపటం సాధ్యం కాదు. ఈ అనుభవాన్ని బట్టి చూస్తే బ్రాహ్మణ కులంలో పుట్టిన వ్యక్తిని బ్రాహ్మణుడిగా భావించటమే అన్ని విధాలా లాభదాయకమని చెప్పాలి. బ్రాహ్మణుడు చేయదగని పనులు చేసినందు వల్ల ఈ జన్మలోనే బ్రాహ్మణుడు శూద్రుడుగా మారవచ్చు. అయినా లోకం అతన్ని బ్రాహ్మణ్ణిగానే భావించినందు వల్ల ఏమీ హాని లేదు. ఈ నాడు వర్ణ వ్యవస్థ యొక్క అర్థమే తారుమారవుతున్నదన్న మాట నిజమే. అందువల్లనే అది ఛిన్నా భిన్నమైపోతున్న మాట కూడా నిజమే. అయినప్పటికీ అడుగడుగునా ఏ నియమం తన సత్యాన్ని నిరూపించుకోవటం నేను ప్రత్యక్షంగా చూస్తున్నానో దాన్ని నేను ఎలా కాదనగలను? దానిని కాదనగలిగితే చాలా చిక్కులనుంచి నన్ను నేను తప్పించుకోగలనని నాకు తెలుసు. కాని అది దుష్ట బుద్ధికి దారి తీస్తుంది. వర్ణ వ్యవస్థను నేను అంగీకరిస్తున్నాను అంటే నిమ్నోన్నత భేద భావాన్ని నేను అంగీకరిస్తున్నట్లు కాదని నేను చాలాసార్లు చాటి చెప్పాను. నిజంగా బ్రాహ్మణుడైనవాడు దాసాను దాసుడై వ్యవహరిస్తాడు. బ్రాహ్మణుడిలో క్షత్రియ, వైశ్య,శూద్రుల గుణాలు కూడా తప్పకుండా ఉంటాయి. కాకుంటే అతనిలో బ్రాహ్మణ గుణాలు మిగిలిన వర్ణాల గుణాలకంటే ఎక్కువ పాళ్ళలో ఉండి తీరాలి. కాని ఈనాడు కులాలు కూడా కుమ్మరిసానెలో తయారవుతున్నాయి. అందులో చేరిన మట్టి పిడత కావచ్చు, గంగాళం కావచ్చు. లేక బ్రాహ్మణుడే కావచ్చు. అది బ్రహ్మకే ఎరుక.

(2) నామటుకు నేను అద్వైత వాదిననే నేను భావిస్తాను. అందులో

అసత్యం లేదు. కాని నేను ద్వైత వాదాన్ని కూడా సమర్థించ వచ్చు. ఈ ప్రపంచం ప్రతి క్షణం మారుతూ ఉంటుంది. అందు వల్లనే ఇది అసత్యమనీ, దీనికి శాశ్వతమైన అస్తిత్వం లేదనీ అంటారు. కాని ఎంత మారినా అందులో మార్పు చెందని నిజ స్వరూపం కొంత ఉంది. ఆ స్వస్వరూపమే దానికి బలాన్ని చేకూరుస్తుంది. ఆ దృష్టిలో అది సత్యం కూడాను. అందు వల్ల ప్రపంచాన్ని సత్యాసత్య స్వరూపమన్నా నాకు అభ్యంతరం లేదు. ఈ కారణం చేత నన్ను అనేకాంత వాదిననీ, స్యాద్వాదిననీ అంటే అందులో నాకేమీ అ సంగతి కనిపించటం లేదు. స్యాద్వాదం నాకు ఎలా అర్థమయిందో అలాగే దాన్ని నేను సమర్థిస్తాను. పండితులు దాన్ని అర్థం చేసుకున్న పద్ధతి వేరు కావచ్చు. వాళ్ళు నాతో వాదిస్తే నేను ఓడిపోతాను. స్వానుభవంతో నేను తెలుసుకున్నది ఏమంటే నా దృష్టితో చూస్తే నా భావం సరిగానే కనిపిస్తుంది. అరితేరిన వ్యాఖ్యాతల దృష్టికి నాలో చాలా లోపాలు కనిపిస్తాయి. కాని ఎవరిమట్టుకు వాళ్ళు ఉభయులు చెప్పేదీ నిజమేనని నా అభిప్రాయం. ఆ నమ్మకం వల్లనే నేను ఎవరు చెప్పినా అది అసత్యమని కానీ బూటకమని కానీ వెంటనే తీర్మానించి చెప్పలేను. ఏడుగురు గుడ్డి వాళ్ళు ఏనుగును చూచి ఏడు విధాలుగా వ్యాఖ్యానించారు. అందరు చెప్పిందీ వాళ్ళ వాళ్ళ దృష్టికి సమ్మతమే. కాని ఒకరుచెప్పింది మరొకరికి నచ్చలేదు. నిజం తెలిసిన జ్ఞాని దృష్టికి వాళ్ళు చెప్పింది సత్యం, అసత్యం కూడా అయింది. నాకు ఈ అనేకాంత వాదమంటే చాలా ఇష్టం. ఆ దృష్టితోటే నేను మహమ్మదీయంగా మహమ్మదీయునీ, క్రీస్తు పరంగా క్రైస్తవునీ పరీక్షించటం నేర్చుకున్నాను. నా అభిప్రాయాలను ఎవరైనా తప్పని వాదిస్తే నాకు వాళ్ళ మీద కోపం వచ్చేది. కాని ఇప్పుడు వాళ్ళ దృష్టితోనే వాళ్ళ అభిప్రాయాలను అర్థం చేసుకో గలుగుతున్నాను. అందువల్ల నాకు వాళ్ళపై అభిమానం, అనురాగం ఏర్పడుతున్నది. ప్రపంచంలో ప్రేమ నాకు ఆహారం. అనేకాంత వాదంలో అహింస, సత్యం రెండూ ఇమిడి ఉన్నాయి.

(3) భగవంతుణ్ణి నేను ఎలా చూస్తానో అలాగే వర్తిస్తాను. లోకాన్ని మోసం చేసి నా అధఃపతనానికి నేను ఎందుకు గురి కావాలి? అందు వల్ల నాకు లభించే బహుమానం ఏముంది? భగవంతుడు నా దృష్టిలో కర్త, అకర్త కూడా. నా స్యాద్వాదంనుండే ఈ భావం ఉదయిస్తుంది. జైనులతో చేరి నేను భగవంతుని కర్తృత్వాన్ని నిరూపిస్తాను. రామానుజులతో కూడి అకర్తృత్వాన్ని కూడా రుజావు చేస్తాను. మనమందరం చింతించనలవి

కాని దాన్ని గురించి చింతన చేస్తాం. వర్ణించనలవికాని దాన్ని వర్ణిస్తాం. తెలియరాని తత్త్వాన్ని తెలుసుకోవాలని ప్రయత్నిస్తాం. అందుకనే మన భాష అసమంజసం, అపరిపూర్ణం అయిపోతుంది. ఒక్కొక్కప్పుడు అది వక్ర రూపాన్ని కూడా ధరిస్తుంది. అందుకనే వేదాలు బ్రహ్మ తత్త్వాన్ని వివరించేందుకు అలౌకికమైన పదాలను వాడారు. 'నేతి నేతి' అని వ్యాఖ్యానించారు. అతడు లేడు, కాని ఉన్నాడు. అస్తి, సత్, సత్యం, 0, 1, 11... అని చెప్పవచ్చు. మనమున్నాం. మనల్ని కన్న తల్లిదండ్రులున్నారు. వాళ్ళను కన్న వాళ్ళు కూడా ఉన్నారు. కాబట్టి అందరికీ జన్మ దాత ఒకడున్నాడు ... అని భావించటం పాపం కాదు; అది ఒక పుణ్య భావన. అలా భావించటం ధర్మం. అతడు లేకుంటే మనమూ లేము. అందువల్లనే మనమందరం అతన్ని ఏక కంఠంతో పరమాత్మ అనీ, భగవంతుడనీ, శివుడనీ, విష్ణువనీ, రాముడనీ, అల్లా, ఖుదా, దాదా హోర్మజ్, జహోవా, గాడ్ అనే అనేక పదాలతో పిలుస్తాము. అతడు ఒక్కడే అనేకంగా కనిపిస్తాడు. అణువుకంటే చిన్న వాడు, హిమాలయం కంటే పెద్ద వాడు. సముద్రం లోని ఒక బిందువులో అతడు ఇమిడి పోతాడు. సప్త సముద్రాలు కలిసి కూడా అతన్ని తమలో ఇముడ్చుకో లేవు. అంత విశాలమైన విరాట్టు అతడు. అతన్ని తెలుసుకునేందుకు బుద్ధి చాలదు. బుద్ధికి అతీతుడు. భగవంతుడున్నాడని గ్రహించేందుకు శ్రద్ధ కావాలి. నా బుద్ధి సరి సరి విధాల భావించి తర్కించుకొని తల్లక్రిందులు కావచ్చు. ఘోర నాస్తికుడితో వాదించి నేను ఓడిపోవచ్చు. కానీ నాలోని శ్రద్ధ నా బుద్ధిని దాటి పరుగిడుతుంది. యావత్ప్రపంచం నాకు ఎదురు చెప్పినా సరే నేను మాత్రం 'భగవంతుడున్నాడు, తప్పక ఉన్నాడు' అనే అంటాను.

కాని భగవంతుడి అస్తిత్వాన్ని నిరాకరించే వారికి అలా నిరాకరించేందుకు అధికారం ఉంది. ఎందుకంటే భగవంతుడు దయామయుడు. రహమ్ (దయ) కలవాడు కాబట్టే అతన్ని రహీమ్, రహమాన్ అంటారు. ఆయన మట్టితో మలచిన మహారాజు కాదు. తన అధికారాన్ని చెలాయించేందుకు సిపాయిలను తైనాతు చేసేందుకు. ఆయన మనకు స్వేచ్ఛనిచ్చి కేవలం దయాబలంతో శాసిస్తారు. ఒకవేళ మనలో ఎవరైనా ఆయన శాసనాన్ని ధిక్కరిస్తే ఆయన ప్రేమతో అంటారు: "నా మాట వినకుంటే మరేమీ పర్వాలేదు. ఆనందంగా ఉండు. నా సూర్యుడు మీకు వెలుగునిస్తాడు. నా మేఘాలు మీకు నీటిని వర్షిస్తాయి. మిమ్మల్ని నా శాసనం క్రింద నడిపించేందుకు మిమ్మల్ని బలవంతం

చేయాల్సిన అవసరం నాకు లేదు." ఇలాంటి భగవంతుని శాపవం అంగీకరించని వారు మూఢ మతులు. నేను మాత్రం ఆయన్ని ఆరాధించే కోట్ల కొలది బుద్ధిమంతుల్లో ఒకణ్ణి. అందుకనే ఆయనకు వెయ్యిమార్లు నమస్కరించినా నాకు అలసట రాదు.



## 23

# దేవుడున్నాడు

ఏదో చెప్పనలవి కాని చేతనాతీతమైన ఒక అమోఘ శక్తి అంతటా వ్యాపించి ఉంది. అది నాకు కనిపించక పోయినా అది ఉన్నదని మాత్రం నాకు అనిపిస్తుంది. ఇది ఒక విధమైన అదృశ్య శక్తి. దాని ప్రభావం మనకు అనుభవంలోకి వస్తుంది. కాని ఏ ప్రమాణానికీ అది పట్టు పడదు. ఇంద్రియజన్యమైన అనుభూతికి అందే పదార్థాలకన్నింటికీ అది భిన్నమయినది. అది అతీంద్రియం.

కాని కొంత వరకు భగవంతుని అస్తిత్వాన్ని నిరూపించ వచ్చు. ప్రపంచంలో మామూలుగా జరిగే పనులను గురించి కూడా ప్రజలకు పూర్తిగా తెలియదు. ఇదంతా ఎవరి చెప్పుచేతల్లో జరుగుతున్నది, ఆ వ్యక్తి ఎందుకు ఏ విధంగా ప్రపంచాన్ని నడిపిస్తున్నాడు అనేది తెలియదు. కానీ ప్రపంచాన్ని నడిపించే శక్తి ఏదో ఉందని మాత్రం వాళ్ళకు పూర్తిగా తెలుసు. గత సంవత్సరం నేను మైసూరులో పర్యటించేటప్పుడు పల్లెటూళ్ళలో కొందరు పేద సాదలను నేను పరామర్శించాను. మైసూరును పరిపాలించేది ఎవరో వాళ్ళకు తెలియదు. ఎవరో దైవ స్వరూపులు పాలిస్తూ ఉండాలని వాళ్ళు సమాధానం చెప్పారు. ఆ నిరుపేదలు తమ పాలకులను గురించి ఇంత అజ్ఞానంలో ఉంటే ఇక నా సంగతి చెప్పాలా? తమ పాలకుల ముందు వాళ్ళెంత స్వల్పులో భగవంతుడి ముందు నేనెంత స్వల్పుణ్ణో చెప్పేందుకు వీల్లేదు. కాబట్టి రాజాధి రాజు జగన్నాథుడైన భగవంతుని ఉనికిని నేను ఊహించు కోలేకపోవటంలో ఆశ్చర్యం లేదు. అయినా, మైసూరులోని గ్రామీణులు మైసూరును గురించి ఊహించుకున్నట్లుగా నేను కూడా ఈ బ్రహ్మాండం

---

11.10.1928, పుటలు 361-365, ఖండం 37, గాంధీ వాఙ్మయం

ఒక వ్యవస్థకు కట్టుబడి ఉందనీ, ప్రపంచంలోని ప్రతి పదార్థానీ, ప్రతి ప్రాణినీ నియమ బద్ధంగా నడిపించే మార్పు లేని తీర్పు ఒకటి ఉందనీ భావిస్తాను. ఆ నియామకం గుడ్డిది కాదు. ఎందుకంటే దృష్టి వివేకాలు లేని ఏ నియామకం కూడా జీవ జగత్తులోని జీవకోటి ప్రవర్తనను క్రమబద్ధం చేయలేదు. మరి ఈ రోజుల్లో సర్ జగదీశ చంద్ర బోస్ కనిపెట్టిన విస్మయాత్మక గవేషణలననుసరించి ప్రతి పదార్థమూ ప్రాణవంతమే అని నిరూపించ వచ్చు. ఇలా ప్రపంచంలోని జీవుల జీవితాన్ని నియమ బద్ధంగా నడిపించే నియామకుడే భగవంతుడు. నియమానికీ, నియామకుడికీ భేదం లేదు. రెండూ ఒకటే. నాకు ఆ నియమాన్ని గురించీ, నియామకుణ్ణి గురించి-అంటే దేవుణ్ణి గురించి ఎక్కువ తెలియదు కాబట్టి ఆ నియామకుని ఉనికినే నేను నిరాకరించటం భావ్యం కాదు. ఏ భౌతిక శక్తినైనా నేను నమ్మినా నమ్మక పోయినా దాన్ని గురించి ఎక్కువగా తెలిసినా తెలియక పోయినా దాని ప్రభావాన్ని నేను తప్పించుకో లేను. అలాగే దేవుడున్నాడని నేను ఒప్పుకున్నా, లేకున్నా ఆ నియమంతో నాకు ప్రసక్తి లేకుండా పోదు. అలా కాక దైవ శక్తిని శిరసా వహించి అంగీకరిస్తే జీవన యాత్ర సుగమంగా సరళంగా సాగిపోతుంది. ప్రాపంచికంగా చూచినా ఏ శక్తికి అధీనులమై మనం జీవన యాపన చేస్తున్నామో దాన్ని అంగీకరించినందు వల్ల జీవితం సులువుగా కొనసాగుతుంది.

ఒకటి మాత్రం నాకు అనిపిస్తుంది. నిరంతరం మార్పు చెందుతూ నశించి పోయే ఈ ప్రపంచం వెనుక మార్పు చెందని చైతన్యం ఏదో ఉంది. అదే అణువణువునా వ్యాపించి సకల జీవ కణాలను ఏక సూత్రంలో కూర్చుతుంది. అదే సృష్టిస్తుంది, సంహారం చేస్తుంది, మరల మరల సృష్టిస్తుంది. అన్నీ తెలిసిన ఆ చైతన్య శక్తియే దైవం. కేవలం ఇంద్రియ జ్ఞానంతో నాకు ఉన్నట్లు గోచరించే వస్తువులన్నీ నశించేవే. అవి నిత్యం కావు. నిత్యం, అవినశ్వరం ఒక్క ఈశ్వరుడే.

ఇక ఆ శక్తి మంగళకరమా, అమంగళకరమా అన్న ప్రశ్నకు నాకు అది పూర్తిగా మంగళకరంగానే గోచరిస్తుందని నా సమాధానం. మృత్యు గర్భంలో జీవనం, అసత్యం వెనుక సత్యం, చీకటి మాటున వెలుగు చోటు చేసుకుని ఉండటమే దీనికి తార్కాణం. అందుకనే జీవితం, సత్యం, జ్యోతి-ఈ మూడింటిలోనే ఈశ్వరుడున్నాడని నానిష్కర్ష. అతడు ప్రేమ స్వరూపుడు. పరమ శివ తత్త్వ స్వరూపుడు.

ఒకవేళ భగవంతుడు కేవలం బుద్ధిని ప్రసాదించేవాడే అయితే తాను నిజంగా భగవంతుడు కానేరడు. హృదయాన్ని అధిష్ఠించి హృదయ

పరివర్తనం చేయగలవాడే భగవంతుడు. తన దాసుని ప్రతి కృతిలో తాను సాక్షాత్కరించాలి. అప్పుడే అతడు భగవంతుడు. భగవద్దర్శనం లభించినప్పుడే ఇది సాధ్యమౌతుంది. ఆ దర్శనం పంచేంద్రియ జ్ఞానానికి అతీతమైన పరమ సత్యంగా పరిణమించాలి. ఇంద్రియాల వల్ల తెలుసుకునే జ్ఞానం ఎంత సత్యమైనా ఒకానొకప్పుడు అది అ సత్యంగా మారుతుంది. ఇంద్రియాలు సామాన్యంగా మనల్ని మోసం చేస్తాయి. ఇంద్రియాతీతమైన జ్ఞానం పొరబడదు. బాహ్య ప్రమాణాలతో దీన్ని నిరూపించటం సాధ్యం కాదు. కాని తమ అంతరంగంలో ఈశ్వరానుభూతిని పొందిన వారి ప్రవర్తనలో సౌశల్యంలో మార్పు కనిపించటమే దీనికి ప్రమాణం.

ఇలాంటి నిదర్శనం అన్ని దేశాలలో అన్ని జాతుల్లో వెలసిన ప్రవక్తలు, ఋషులు, మునులు పొందిన అనుభవంలో కనిపిస్తుంది. ఈ పరంపర అవిచ్ఛిన్నమైనది. ఈ ప్రమాణాన్ని నిరాకరించటం తన్ను తాను నిరాకరించినట్లే.

అచంచలమైన ఆస్తిక్య బుద్ధిని పురస్కరించుకునే ఇలాంటి అనుభూతి కలుగుతుంది. భగవంతుని ఉనికిని తనకు తాను ప్రత్యక్షంగా సాక్షాత్కరించుకోవాలనుకున్న వ్యక్తి ఎవరైనా ప్రాణవంతమైన ఆస్తిక్య బుద్ధి వల్లనే అది సాధించ గలుగుతాడు. ఆస్తిక్య బుద్ధిని నిరూపించేందుకు కూడా బాహ్య ప్రమాణమేమీ పని చేయదు. అందు వల్ల ప్రపంచంలో శాసించేది నీతి అనీ, నైతికమైన శాసనమే సర్వోన్నత శాసనమనీ, అంటే సత్యమూ, ప్రేమ-ఈ రెండే చట్టాన్ని సమకూర్చ గలవనీ నమ్మటమే శ్రేయో మార్గం. సత్యానికీ ప్రేమకూ విరుద్ధమైన ప్రతిదాన్నీ అన్ని విధాలా పరిత్యజించేందుకు కృత సంకల్పులైన వాళ్ళే ఆస్తిక్య మార్గాన్ని అనుసరించి కృతార్థులు కాగలరు.

ప్రపంచంలో చెడు ఎందుకు ఉంటుంది అనే ప్రశ్నకు నేను సహేతుకమైన సమాధానం ఏమీ చెప్పలేను. అలా చెయ్యాలని అనుకోవటం భగవంతునితో సమానమైన ప్రతిపత్తికోసం ప్రయత్నించటం అవుతుంది. కాబట్టి చెడును చెడుగా సహజ వినయంతో స్వీకరించటంతోనే నేను తృప్తి పడుతాను. భగవంతుడు కూడా చెడును చెడుగానే ప్రపంచంలో ఉండనిస్తాడు. కనుకనే ఆయన సహనాన్ని, ధైర్యాన్ని నేను కొనియాడుతాను. భగవంతుడిలో చెడు అనేది రవ్వంత కూడా లేదని నాకు తెలుసు. ఆయన అన్ని విధాల పరిశుద్ధుడు. చెడ్డతనాన్ని సహించి కూడా ఆయన దానికి దూరంగా ఉంటాడు.

ప్రాణాలను కూడా లెక్క చేయకుండా చెడ్డతనాన్ని ప్రతిఘటించేందుకు

నేను ప్రయత్నించకపోతే నేను భగవంతుణ్ణి ఏనాటికీ తెలుసుకోలేనని కూడా నాకు తెలుసు. నా పరిమితమైన అత్యల్పమైన అనుభవం నా యీ నమ్మకాన్ని బల పరుస్తుంది. ఎంత పవిత్రంగా ఉండేందుకు నేను ప్రయత్నిస్తానో భగవంతుడికి నేను అంత దగ్గర అయినట్టు నాకు అనిపిస్తుంది. ఈ నాడు అణు మాత్రంగా క్షమాయాచన పూర్వకంగా నాలో ఉన్న శ్రద్ధ హిమాలయం లాంటి స్థైర్యాన్ని ఆ శిఖరాగ్రంలోని ధవళతరళ శృంగాలలోని ప్రశాంతిని అలవరచుకోగలిగితే నేను పరమాత్మకు ఎంత దగ్గరివాణ్ణవుతానో? అంత వరకూ న్యూ మన్ స్వానుభూతితో కూడుకుని పాడుకున్న ఈ ప్రార్థనా గీతాన్ని సమవేత స్వరంతో స్మరించ వలసిందని విలేఖరికి నా విన్నపం:

కనికరమున కరమును గొని
    కర దీపము చూపించుము
తొలగించుము నలువైపుల
    అలముకొన్న చీకటులను
అంధకార బంధుర నిశి-
    ఆ వాసము బహు దూరము
తడబడుచున్నవి అడుగులు
    ధైర్యమొసగి నిలబెట్టుము
దూర దూర దృశ్యములను
    కోరను; ఒక అడుగు చాలు.

[ఆంగ్లం నుండి]
యంగ్ ఇండియా, 11.10.1928



24

# లోజాన్ సభలో చేసిన ప్రసంగం

దేవుడు సత్య స్వరూపుడని నేనెందుకు భావిస్తున్నానని మీరు అడిగారు. నా చిన్నతనంలో హిందువులు పారాయణం చేసే సహస్ర నామాలను నన్నుకూడా పారాయణం చేయమని నాకు చెప్పారు. కాని సహస్ర నామం కేవలం వెయ్యి నామాల వరకే పరిమితమయినది కాదు. మాకో నమ్మకం ఉంది. నాకు కూడా అది నిజమనే అనిపిస్తుంది. ఎంతమంది జీవధారులున్నారో అన్ని నామాలు భగవంతుడికి ఉన్నాయి. అందుకని మనం భగవంతుడు నామ రహితుడని అంటాం. భగవంతునికి అనేక రూపాలు ఉన్నాయి కాబట్టి అతణ్ణి రూప రహితుడంటాం. అలాగే ఆయన మనతో అనేక భాషల్లో మాట్లాడుతాడు కాబట్టి అతణ్ణి వాగతీతుడంటాం. అలాగే ఇస్లాం మతాన్ని పరిశీలించినపుడు అందులో కూడా భగవంతుడికి చాలా పేర్లున్నాయని నాకు తెలిసింది. భగవంతుడు ప్రేమ స్వరూపుడన్న వారితో నేను పూర్తిగా ఏకీభవించి వారితో కలిసి నేను కూడా భగవంతుడు ప్రేమ స్వరూపుడని అంటాను. కానీ హృదయాంతరాలలో ప్రవేశించి నప్పుడు నాకు భగవంతుడు ప్రేమ స్వరూపుడుగానే కాక అన్నింటికంటే మించి సత్య స్వరూపుడుగా కనిపిస్తాడు. మనుష్య వాణి భగవంతుణ్ణి, పూర్తిగా వర్ణించ గలిగితే నా మటుకు నేను భగవంతుడు సత్య స్వరూపుడనే రూఢిగా చెప్తాను. రెండు సంవత్సరాల క్రితం ఒక అడుగు ముందంజ వేసి సత్యమే భగవంతుడని నేను చెప్పాను. భగవంతుడే సత్యం, సత్యమే భగవంతుడు ఈ రెండు వాక్యాలకూ మధ్య సూక్ష్మ భేదం మీరు గమనించ గలరు. దాదాపు యాభై సంవత్సరాలనుంచి నేను చేస్తూ వచ్చిన నిరంతర నిశిత సత్యాన్వేషణకు పర్యవసానంగా నేనీ

---

31.12.1931, పుటలు 446-449, ఖండం 48, గాంధీ వాఙ్మయం

నిర్ణయానికి వచ్చాను. సత్యాన్ని చేరుకునేందుకు అన్నిటి కంటే,దగ్గరి దారి ప్రేమ మార్గమని తెలుసుకున్నాను. ఆంగ్లంలో ప్రేమ (లవ్) శబ్దానికి చాలా అర్థాలున్నాయని నాకు తెలిసింది. మానవ సహజమైన కామం మనిషిని దిగజారుస్తుందని కూడా గమనించాను. అహింసగా ప్రేమను ఆరాధించే వాళ్ళు ప్రపంచంలో చాలా కొద్దిమంది అని కూడా నేను చూచాను. నా పరిశోధనలో పురోగమించి నేను భగవంతుడు ప్రేమ స్వరూపుడనే సత్యాన్ని ఖండించ లేదు; కాని ప్రేమకు గల నానార్థాలను బట్టి భగవంతుడు ప్రేమ స్వరూపుడని అర్థం చేసుకోవడం చాలా కష్టమని మాత్రం గమనించాను. కామ రూపమైన ప్రేమ మానవ పతనానికి దారి తీస్తుందనేది కూడా నిజమే. కాని సత్యానికి రెండర్థాలుండటం నేను చూడలేదు. నాస్తికులు కూడా సత్యం యొక్క అవసరాన్నీ, ప్రభావాన్నీ నిరాకరించలేదు. అంతే కాదు, సత్యాన్వేషణలో నిమగ్నులయిన వాళ్ళు భగవంతుని అస్తిత్వాన్ని సైతం నిరాకరించేందుకు వెనుదీయలేరు. వాళ్ళ దృష్టిలో అది సమంజసమే. వాళ్ళ వాదనను విన్న తరువాతనే భగవంతుడు సత్య స్వరూపుడు అనే కంటే సత్యమే భగవంతుడు అనటం నాకు ఎక్కువ సముచితంగా తోచింది. ఈ సందర్భంలో నాకు చార్లస్ బ్రాడ్లె పేరు జ్ఞప్తికి వస్తుంది. ఆయన మహనీయుడైన ఆంగ్లేయుడు. దాదాపు యాభై సంవత్సరాల క్రితం ఆయన మరణించారు. తాను నాస్తికుడని చెప్పుకొనటం ఆయనకు అదో రకమయిన సరదాగా ఉండేది. కాని నాకు ఆయన జీవితం చాలా సన్నిహితంగా తెలుసు. ఆయన్ని నాస్తికుడిగా నేను ఎన్నడూ భావించలేదు. ఆయన దైవభీతి కలవాడని నేనంటాను. ఆయన మాత్రం నాతో ఏకీభవించరనుకోండి. నామాటలు వినగానే ఆయన ముఖం ఎఱ్ఱ బారేది. నేను ఆయనతో అనేవాణ్ణి: అలా కాదు బ్రాడ్లె గారూ! మీకు దైవమంటే భయం లేదు; కాని సత్యమంటే భయం. 'సత్యమే భగవంతుడు' అని చెప్పి ఎందరు యువకులనో నేను నిరుత్తరులను చేసినట్టు ఆయన్ని కూడా లొంగదీసుకునే వాణ్ణి. 'భగవంతుడు సత్య స్వరూపుడ'ని చెప్పటంలో ఒక చిక్కుంది. కోట్ల కొలది ప్రజలు భగవంతుణ్ణి స్మరిస్తూ చెప్పనలవి గాని దుష్కృత్యాలు చేస్తూ ఉంటారు. సత్యం పేరిట శాస్త్రజ్ఞులు కూడా క్రూరకృత్యాలు చేయలేకపోలేదు. సత్యం, విజ్ఞానం పేరిట పశువులపై జరిగే ఘోరమైన హింసా కాండ, అమానుషమైన క్రౌర్యం నాకు తెలుసు. మీరు భగవంతుణ్ణి సత్య స్వరూపుడనండీ లేక మరో పేరిట పిలవండి-కానీ నేను మాత్రం ఈ క్రౌర్యాన్ని, భగవంతుడి ఉనికిని నిరాకరించటమనే అంటాను. ఇంతకూ

సారాంశ మేమిటంటే భగవంతుణ్ణి ఎలా నిరూపించినా అందులో కొన్ని చిక్కులు ఉండనే ఉంటాయి. కాని మానవ మస్తిష్కం ఒక పరిమిత పరిధిలోనే పని చేయ గలదు. మన మనస్సు అవగాహనకు మించిన శక్తిని గురించి మనం ఆలోచించేటప్పుడు మన ఎల్లలలోనే సంచరించ వలసి ఉంటుంది. కాని హిందువుల తత్త్వ చింతనలో ఒక విశేషముంది. కేవలం భగవంతుడు మాత్రమే సత్యమని మరి యేమీ లేదని వాళ్ళంటారు. ఇస్లాం 'కలమా' లో ఈ సత్యాన్నే బల పరచి చెప్తారు. మహమ్మదీయులు 'ఇబాదత్' లో అల్లా తప్ప ప్రపంచంలో మరేమీ లేదని మాటి మాటికీ నొక్కి చెప్తారు. సత్యం విషయం కూడా ఇంతే. సంస్కృతంలో సత్యాన్ని 'సత్' అంటారు. 'సత్' అంటే 'ఏది ఉన్నదో అది' అని అర్థం. ఈ కారణాల వల్లనూ, మరెన్నో కారణాల వల్లనూ సత్యమే భగవంతుడనే నిర్ణయానికి నేను వచ్చాను. సత్యాన్ని భగవంతుడి రూపంలో మీరు పొందాలంటే ప్రేమ అంటే అహింస తప్ప మరో మార్గం లేదు. సాధనం,సాధ్యం రెండూ చివరకు ఒకటే అవుతాయని నా విశ్వాసం. కనక భగవంతుడు ప్రేమ స్వరూపుడని చెప్పటంలో నాకు సందేహం లేదు.

ప్రశ్న: అయితే సత్యమంటే ఏమిటి?

జవాబు: ప్రశ్న జటిలమైంది. కాని దానికి నేను సమాధానం కనుక్కున్నాను. మన అంతరాత్మ ఏమి చెప్తే అదే సత్యం. అయితే వేరు వేరు వ్యక్తులు వేరు వేరు విధాలుగా పరస్పర విరుద్ధంగా సత్యానికి రూప కల్పన చేసుకోవచ్చు కదా అని మీరనవచ్చు.

దానికి సమాధానం ఇది. మానవ మస్తిష్కం అసంఖ్య సూత్రాలలో పయనిస్తుంది. అందరి మనో వికాసం ఒకే విధంగా ఉండదు. అందువల్ల ఒకరికి సత్యంగా కనిపించేది మరొకరికి అసత్యం కావచ్చు. అందు వల్లనే ఇలాంటి విషయాలపై పరిశోధన చేసిన వాళ్ళు ఈ పరిశోధనలు చేసేటప్పుడు కొన్ని నిబంధనలను పాటించి తీరాలనే తీర్మానానికి వచ్చారు. శాస్త్ర పరిశోధనలు చేసే వాళ్ళందరికీ ఒకే పద్ధతిని అనుసరించటం అనివార్యమైనట్లే ఆధ్యాత్మికరంగంలో కూడా పరిశోధన చేయదలచుకున్న వారు కొన్ని నిబంధనలను పాటించి తీరాలి. అంతే కాక ప్రతి వ్యక్తి తన అంతరాత్మ పలికే వాక్కు తనకు వినిపిస్తున్నట్లు భావిస్తాడు. కాబట్టి ఆ వాక్కును వినాలి. ఈ సాధనా పథంలో ముందుకు సాగే కొద్దీ మనకు మన మర్యాదలు అర్థమవుతాయి. కాబట్టి ఈ అనుభూతిని ఆధారం చేసుకుని సత్యాన్వేషణ-అంటే ఈశ్వర సాక్షాత్కారం-కోసం

ప్రయత్నించే వాళ్ళు కొన్ని వ్రతాలను ఆచరించ వలసి ఉంటుంది. ఈ వ్రతాలే సత్యం (నిజం చెప్పటం, నిజం భావించటం), బ్రహ్మచర్యం, అహింస, అసంగ్రహం, అపరిగ్రహం. ఈ ఐదు వ్రతాలను పాటించక పోతే మీకు ఆత్మ చింతన చేసేందుకు అధికారమే ఉండదు. ఇంకా ఇలాంటి వ్రతచర్య చాలా ఉంది. అవన్నీ మీకుప్రస్తుతంచెప్పటం లేదు. కానీ ఈ రంగంలో పరిశోధన చేసిన వాళ్ళకు అంతర్వాణి వినగల శక్తి అందరికీ ఉండదని తెలుసు. ఈ నాడు ప్రపంచంలో మిథ్యాలాపం విపరీతంగా ప్రబలి ఉన్నది. ప్రతివాడూ పరిశోధనకు కావలసిన నియమాలను పాటించకుండానే తనకు అంతర్వాణి వినిపించిందని గొప్పలు చెప్పుకుంటున్నారు. కాబట్టి వినయం లేనిదే సత్యం లభించదని నేను వినయ పూర్వకంగా విన్నవించుకుంటున్నాను. సత్యమనే సముద్రాన్ని తరించాలంటే మీరు మీ శూన్యతను అనుభవించి తీరాలి. తనలోని అహంకారాన్ని పూర్తిగా నిర్మూలించుకోవాలి. తన్మయత్వంతో తరిచి తరిచి తెలుసుకొన వలసిన ఈ విషయాన్ని గురించి ఈ దినం నేను ఇంత కంటే ఎక్కువ చెప్పను.



## 25

# తిరువనంతపురంలోని ఇల్వా సమావేశంలో చేసిన ప్రసంగం

శ్రీ పద్మనాభ స్వామి ఆలయంలో నేను చూచింది చూచినట్లు చెప్పి తీరాలి. విశుద్ధమైన ఆధ్యాత్మిక పునర్జాగృతిని గురించి నేను చెప్ప దలచుకున్నదంతా ఆ వివరణలో స్పష్టమవుతుంది. నా తల్లిదండ్రులు బాల్యంలో నా మనస్సులో నెలకొల్పిన శ్రద్ధా భక్తులను పురస్కరించుకొనే నేను ఆలయాలను సందర్శించాను. కాని ఇటీవల కొన్ని సంవత్స రాలనుంచి నేను ఆలయాలకు వెళ్ళ లేదు. అంటరాని తనాన్ని అంతరింపజేసే పని నేను చేపట్టినప్పటి నుంచి అస్పృశ్యులు అనబడేవాళ్ళు ప్రవేశించేందుకు వీలు లేని ఏ ఆలయానికీ నేను వెళ్ళ లేదు. అందువల్ల ఈరోజు ఉదయం నాకు ఆలయంలో గోచరించిన నూతనత్వాన్ని పోలిన నవీనతను ఆలయ ప్రవేశం ప్రకటించిన తర్వాత గుడిలో అడుగు పెట్టిన తక్కువ కులం వాళ్ళు అనుభవించి ఉంటారు. కల్పనా బలంతో నా మనస్సు పూర్వ చారిత్రిక యుగంలో ప్రవేశించింది. మానవుడి మనస్సులో ఈశ్వర భావం ఉదయించింది. పాషాణ విగ్రహాలలో, ధాతు శిల్పాలలో అతడు తన భగవద్భావనను సాక్షాత్క రించుకునేందుకు ఉపక్రమించాడు. అర్చకుడు తనకు వచ్చిన ముద్దు హిందీ మాటల్లో ప్రతి విగ్రహాన్ని గురించి చెప్పాడు. అలా వివరించటంలో అక్కడ కనిపించే ప్రతి విగ్రహంలో భగవంతుడు ఉన్నాడని చెప్పాలని అతని ఆశయం కాదు. కాని ఆ విగ్రహాలను గురించి విపులంగా వ్యాఖ్యానించకుండానే అక్కడి ప్రతి ఆలయం మనకు కనిపించని

---

20.1.1937, పుటలు 266-267, ఖండం 64, గాంధీ వాఙ్మయం

గోచరించని చెప్పనలవి గాని సర్వ శక్తి సంపన్నుడైన పరమేశ్వరునితో అగాధమైన సంసార సాగరంలో క్షుద్ర బిందువులుగా పడి ఉన్న మానవులను కలిపే మహా సేతువనే భావం మాకు కలిగేటట్టు చేసారు. మనమందరమూ తత్త్వవేత్తలం కాలేము. మనం కేవలం మట్టి బొమ్మలం. మట్టిలో మునిగి కనిపించకుండా ఉన్న భగవంతుణ్ణి గురించి ఆలోచించినంత మాత్రాన మనకు ఆనందం లభించదు. ఎందుకో చెప్పలేము కాని, మన చేతులతో తాకి, కళ్ళతో చూచి, శ్రద్ధా భక్తులతో తల వంచి నమస్కరించుకో గల ఆకారం లేక పదార్థం మనకు కావాలి. అది ఒక పుస్తకం కావచ్చు, శూన్యమైన రాతి కట్టడం కావచ్చు. ఇటుకలతో కట్టిన ఆలయంలోని విగ్రహాలు కావచ్చు. ఏదయినా సరే, మనకొక ఆధారం కావాలి. కొంతమంది పుస్తకాలతో తృప్తి పడతారు. కొందరు కట్టడాలు చూచుకొని సంతోషిస్తారు. మరి కొందరికి ఆలయంలో కొన్ని విగ్రహాలు కనిపిస్తేనే గాని, మనసు నిలవదు. ఇంతకూ నేను చెప్పదలచింది ఏమంటే మీరు ఈ ఆలయాలకు వెళ్ళేటప్పుడు అవి మూఢ విశ్వాసాలకు మూల స్థానాలు అనే భావంతో వెళ్ళకండి. మీరు శ్రద్ధాసక్తులతో ఆలయాలకు వెళ్ళితే ఎన్ని పర్యాయాలు వెళ్ళితే అన్ని రెట్లు అంతఃశుద్ధితో భగవంతుని మీద భక్తితో తిరిగి వస్తారు.



## 26

# 'గీతా'ర్థ విచారం

ఒక మిత్రుడు ఇలా ప్రశ్నిస్తారు:

'గీత'ఇచ్చే సందేశం ఏమిటి? హింసా లేక అహింసా? ఈ ప్రశ్న ఎప్పటికీ ప్రశ్న లాగే ఉండి పోతుంది. మనకు గీత ఏమి చెబుతుంది లేక ఏమి చెప్పించుకోవాలని మనం అనుకుంటాం అనేది ఒక విషయం. నిష్పాక్షికంగా గీత చదవగానే మనకు అనిపించేది ఏమిటి అనేది మరో విషయం. అహింసా తత్త్వమే జీవిత సందేశమని అంతఃకరణ శుద్ధిగా భావించిన వాళ్ళకు ఈ ప్రశ్న అంత ప్రధానం కాదు. గీత చెప్పేది అహింస అయితే అది వాళ్ళకు ఎలాగూ సమ్మతమవుతుంది. ఇంత గొప్ప గ్రంథం అహింసనే చెప్పి తీరాలని వాళ్ళను కుంటారు. ఒకవేళ అలా కాకపోయినా వాళ్ళకు ప్రమాదం లేదు. 'గీత'ను వాళ్ళు గౌరవిస్తారు. కానీ దాన్ని ప్రమాణంగా భావించరు.

మీ పని ఒత్తిడిలోనుంచి కొన్ని క్షణాలు వినియోగించి దీనికి సమాధానం చెప్ప గలిగితే బాగుంటుంది.

ఇలాటి ప్రశ్నలు ఉదయిస్తూనే ఉంటాయి. గీతాధ్యయనం చేసిన వాళ్ళు ఇలాంటి ప్రశ్నలకు చేతనయినంత వరకు సమాధానం చెప్పటం కూడా అవసరమే. కాని ఎవరేమి చెప్పినా చివరకు మానవుడు తన హృదయం చెప్పిన ప్రకారమే చేసి తీరుతాడనేది కూడా నిజమే. ముందు హృదయం. తరువాత బుద్ధి. సిద్ధాంతం మొదటిది, ప్రమాణం తర్వాత. స్ఫూర్తి కలిగిన తర్వాతనే దానికి అనుకూలమైన తర్కం తయారవుతుంది.

---

12.11.1925, పుటలు 327-332, ఖండం 28, గాంధీ వాఙ్మయం

తొలుత కర్మ, పిదప బుద్ధి. అందుకనే 'బుద్ధిః కర్మానుసారిణీ' అంటారు. మనిషి తాను చేసే పనిని లేక చేయదలచుకున్న పనిని సమర్థించు కునేందుకు ప్రమాణాన్ని వెతుక్కుంటాడు.

కాబట్టి 'గీత'కు నేను చెప్పుకునే అర్థం అందరికీ ఆమోదకరం కాకపోవటం నాకు సమంజసం గానే తోస్తుంది. అందువల్ల నేను నా మటుకు 'గీత'ను ఎలా అర్థం చేసుకున్నానో ధర్మ శాస్త్రంలోని ఆశయాలను అవగాహన చేసుకునేందుకు నేను అనుసరించిన సిద్ధాంత సరణి ఏమిటో అంత వరకూ మాత్రం నేను చెప్తాను. "పర్యవసానం ఏమయినా నేను యుద్ధం చేసి తీరాలి. మరణించ వలసిన శత్రువులు మరణించక మానరు. ఈ మారణ కర్మలో నేను కేవలం నిమిత్తమాత్రుణ్ణి."

నాకు 1889 లో 'గీత'తో ప్రథమ పరిచయం ఏర్పడింది. అప్పుడు నా వయస్సు 20 సంవత్సరాలు. ఆ వయస్సులో నాకు అహింసా ధర్మాన్ని గురించి ఎక్కువగా తెలియదు. 'శత్రువును కూడా ప్రేమతోనే జయించాలి'-అనే విషయం నేను గుజరాతీ కవి శామల్ భట్ రచించిన షట్పది (పాణీ ఆపేనే పాయ్ భలుం భోజన్ తో దీజే) నుంచి నేర్చు కున్నాను. దీనిలో ఇమిడి ఉన్న సత్యం నా హృదయంలో నిలిచిపోయింది. కాని అప్పుడు నాకు ఇందులో భూత దయ అనేది ఇమిడి ఉందని స్ఫురించ లేదు. అంతకు ముందు నేను స్వదేశంలోనే మాంసం తినేవాణ్ణి. సర్పంలాంటి దుష్ట జంతువులను సంహరించటం ధర్మమనే నేను భావించే వాణ్ణి. నల్లుల్లాంటి జీవాలను చంపినట్టు నాకు జ్ఞాపకం ఉంది. ఒకసారి నేను తేలును చంపినట్టు కూడా నాకు గుర్తుంది. కాని ఇప్పుడు మాత్రం విష జంతువులను కూడా చంపకూడదని నా అభిప్రాయం. ఆంగ్లేయులతో సశస్త్ర యుద్ధం చేసేందుకు మనం సన్నద్ధులుగా ఉండాలని ఆ రోజుల్లో నేను అనుకునే వాణ్ణి. "ఆంగ్లేయులు పాలకులైతే ఆశ్చర్యం ఏముంది?" అన్న కవిత నా నోట నానుతూ ఉండేది. ఇందుకు పూర్వ రంగంగా నేను మాంసాహారాన్ని అలవరచుకున్నాను. విదేశాలకు వెళ్ళే ముందు నా ఆలోచనలు ఇలా ఉండేవి. నన్ను మాంసాహారం నుంచి రక్షించింది, మా తల్లికి నేను చేసిన వాగ్దానాన్ని ఆమరణం పాలిస్తానని నేను చేసుకున్న సంకల్పం. నా సత్యాసక్తి నన్ను పలు విధములైన ప్రమాదాలనుంచి రక్షించింది.

ఆ తర్వాత ఇద్దరు ఆంగ్లేయులతో ఏర్పడిన సంబంధం వల్ల నేను 'గీత' చదవాల్సి వచ్చింది. 'చదవాల్సి వచ్చింది' అని అంటున్నాను, ఎందుకంటే చదవాలని నాకు ప్రత్యేకంగా ఆసక్తి ఉండేది కాదు. కాని

ఈ సోదరులిద్దరూ నాతో కలిసి 'గీత' చదవాలని కోరే సరికి నాకు సిగ్గు వేసింది. నాకు మన ధర్మ శాస్త్రాలను గురించి బొత్తిగా పరిజ్ఞానం లేకపోవటం నాకు చాలా బాధాకరంగా ఉండేది. నా అభిమానమే ఈ బాధకు కారణం. 'గీత' లోని శ్లోకాలనన్నింటినీవేరే సాయం లేకుండా అర్థం చేసుకో గలిగినంతగా నేను సంస్కృతం చదవలేదు. ఈ సోదరులిద్దరికీ ఏమీ తెలియదు. సర్ ఎడ్విన్ ఆర్నాల్డ్ 'గీత'కు చేసిన చక్కని కావ్యానువాదాన్ని వాళ్ళు నా ముందు పెట్టారు. వెంటనే నేనా పుస్తకం చదివి మురిసిపోయాను. అప్పటినుంచి ఇప్పటి వరకూ రెండో అధ్యాయంలోని చివరి 19 శ్లోకాలు నా హృదయంలో ముద్రితమయి పోయాయి. నాకు సకల ధర్మసారం అందులోనే గోచరించింది. అందులో పరిపూర్ణమైన జ్ఞానం ఉంది. దానిలో చెప్పిన సిద్ధాంత వాక్యాలు తిరుగు లేనివి. బుద్ధి కూడా అందులో బాగా ఉపయోగపడి ఉంది. కాని అది సంస్కారంతో కూడిన బుద్ధి. అనుభవజ్ఞానం అందులో ఉంది.

ఆ తొలి పరిచయం తర్వాత నేను చాలా అనువాదాలు చదివాను, చాలా వ్యాఖ్యలు కూడా చదివాను. రకరకాల తర్కాలు చేశాను, విన్నాను. కాని, తొలి సారి చదవగానే నా హృదయంలో ఏర్పడిన ముద్ర చెరగలేదు. ఈ శ్లోకాలు గీతార్థాన్ని అవగాహన చేసుకునేందుకు చేదివ్వెలు. వీటికి విరుద్ధమైన వాక్యాలు తటస్థ పడితే వాటిని పరిత్యజించ వచ్చునని కూడా నేను చెబుతాను. నయ వినయ సంపన్నుడైన వ్యక్తికి వాటిని త్యజించవలసిన అవసరం కూడా ఉండదు. ఏ పరిస్థితిలోనైనా ఇతర శ్లోకాలతో వీటికి సమన్వయం కుదరకపోతే అతడు అది తన భావనా శక్తిలో లోపమనుకుని సరిపెట్టుకుంటాడు. సరియైన సందర్భం వచ్చినప్పుడు ఆ పందొమ్మిది శ్లోకాలతో మిగిలిన శ్లోకాల సమన్వయం స్వతస్సిద్ధంగా కుదిరి పోతుంది. తనకు తాను సమాధాన పెట్టుకుని ఇతరులకు కూడా అతడు సమాధానం చెప్పగలుగుతాడు.

శాస్త్ర పరిజ్ఞానానికి సంస్కారం, అనుభవం అవసరం. 'శూద్రుడు వేదాధ్యయనం చేయకూడదు'-అనే వాక్యం పూర్తిగా అగ్రాహ్యం కాదు. శూద్రుడంటే సంస్కారం లేని వాడు, మూర్ఖుడు, అజ్ఞాని. అలాంటి వాడు వేదాలను చదివితే వాటిని అపార్థం చేసుకుని అనర్థానికి దారి చూపిస్తాడు. వయసు మళ్ళిన వాళ్ళు బీజ గణితానికి సంబంధించిన సమస్యలను సాధించేందుకు సమర్థులు కానేరరు. దానికి ముందు కొంత క్రమ శిక్షణ, అభ్యాసం అవసరం. వ్యభిచారి నోట 'అహం బ్రహ్మాస్మి' అనే వాక్యం వెగటుగా తోస్తుంది. దానికి అతడు ఏమి వ్యాఖ్యానం

చేయ గలడు?

అంటే శాస్త్రాలకు అర్థం చెప్పే వ్యక్తి యమ నియమాలను పాటించేవాడుగా ఉండాలి. నియమ పాలన శుష్కంగా చేసి లాభం లేదు. అది కష్ట సాధ్యము, నిరర్థకం కూడాను. శాస్త్రాలు గురువు చాలా అవసరమని చెప్పాయి. కాని ఈ రోజుల్లో గురువులు దాదాపు లోపించి పోయారు. కాబట్టి భక్తిని బోధించే సద్గ్రంధాలను పఠించ వలసిందని జ్ఞానులు చెప్పారు శ్రద్ధా భక్తులు లేని వాళ్ళకు శాస్త్రాలకు అర్థం చెప్పే అధికారం లేదు. పండితులు తమ పాండిత్యాన్ని ఉపయోగించి వ్యాఖ్యానం చేయ వచ్చు. కాని అది శాస్త్రార్థం కాదు. అనుభవజ్ఞుడు మాత్రమే శాస్త్రానికి అర్థం చెప్ప గలడు.

కాని సామాన్య మానవులకు కూడా కొన్ని సిద్ధాంతాలున్నాయి. సత్య సమ్మతం కాని శాస్త్రార్థం సత్యం కానేరదు. సత్యాన్ని సత్యంగా భావించలేని వ్యక్తికి శాస్త్రం అనేదే లేదు. మరో విధంగా చెప్పాలంటే శాస్త్రమంతా అతనికి అశాస్త్రమే. అతన్ని సమాధాన పరచటం సాధ్యం కాదు. ఎవరికి శాస్త్రంలో అహింస కనిపించదో, వాళ్ళ స్థితి చాలా భయావహం. అయినా వాళ్ళకు కూడా తరుణోపాయం లేకపోలేదు. సత్యం-సత్-ఉన్నదాన్ని చెబుతుంది. అహింస ఉండకూడనిది చెబుతుంది. సత్యం తథ్యాన్ని ప్రతిపాదిస్తుంది. అహింస యదార్థాన్ని ఖండిస్తుంది. అయినా అహింస పరమ ధర్మం. సత్యం తనంతట తానే తెలియ వస్తుంది. అహింస దాని పరిపక్వ ఫలితాన్ని అందిస్తుంది. సత్యంలో అహింస ఉంది. కాని అది సువ్యక్తం కాదు కాబట్టి శాస్త్రార్థం చేసేటప్పుడు అహింసను అంగీకరించక పోవచ్చు. కాని సత్యాన్ని స్వీకరిస్తే అహింసను అంగీకరించినట్లే.

సత్యం కావాలంటే తపస్సు చేసి తీరాలి. సత్యాన్ని సాక్షాత్కరించుకున్న తపస్సంపన్నులు నలువైపుల వ్యాపించిన హింసలోనుంచి అహింసా దేవిని ఆవిర్భవింప జేసి అందరికీ చూపించి చెప్పారు: హింస మిథ్య, మాయ. అహింస మాత్రమే సత్యం. బ్రహ్మచర్యం, అస్తేయం, అపరిగ్రహం-ఇవన్నీ అహింస కోసం ఏర్పరచుకొన్నవే. అహింస సిద్ధించేందుకు సహకరించే శక్తులే ఇవి. అహింస సత్యానికి ప్రాణం పోస్తుంది. అది లేని మనిషి పశుప్రాయుడు. సత్యార్థి తన పరిశోధనా పథంలో వీటిని అవలీలగా అవగాహన చేసుకుంటాడు. అప్పుడతనికి శాస్త్రార్థం సునాయాసంగా అవగతమైపోతుంది.

శాస్త్రార్థంలో మరో నియమం ఏమంటే కేవలం పదాలను పట్టుకొని

ఊగులాడకుండా పదార్థంలోని పరమార్థాన్ని, ధ్వనిని, రహస్యాన్ని గుర్తించాలి. తులసీ రామాయణం ఉత్తమ గ్రంథం. ఎందుకంటే పవిత్రత, దయ, భక్తి లాంటి భావాలు ధ్వనిస్తాయి. 'శూద్రులు, పామరులు, బాజాలు, పశువులు, మహిళలు తాడనయోగ్యుల'ని అందులో ఉంది కదా అని మగవాళ్ళు తమ భార్యలను బాదటం మొదలు పెడితే వాళ్ళు అథోగతి పాలవుతారు. శ్రీ రామ చంద్రుడు సీతను ఎన్నడూ హింసించలేదు, ఏ మాత్రం కష్ట పెట్టను కూడా లేదు. తులసీ దాసు కేవలం లోక రీతిని సూచించారు. ఆయన వాక్యాన్ని పురస్కరించుకొని స్త్రీలను పశువులుగా చూచే భర్తలు బయలు దేరుతారని ఆయన ఊహించి కూడా ఉండరు. ఒకవేళ తులసీ దాసే ఇలాంటి కూడని పని చేసి ఉన్నా కూడా అది కాదు ఆయన కావ్యార్థం. రామాయణ పరమార్థం పూర్ణ పురుష సందర్శనం కాని, పత్నీ పీడనం కాదు. సాధ్వీమణి సీత సౌశీల్యాన్నీ, భరతుడి భ్రాతృ భక్తినీ నిరూపించటమే ఈ కావ్యం యొక్క ప్రయోజనం. దోషపూరితములైన ఆచారాలను సమర్థించటం జరిగితే వాటిని ఉపేక్షించటమే ఉత్తముల లక్షణం. అలాగే భూగోళానికి సంబంధించిన కొన్ని పొరబాట్లు అందులో వస్తే వాటిని నిరాకరించాలి. భూగోళం బోధించేందుకు తులసీ దాసు రామాయణం వ్రాయలేదు.

ఇక 'గీత' సంగతికి వద్దాం. బ్రహ్మ జ్ఞానం పొందేందుకు సాధన చేయటమే గీతలో ప్రతిపాదింప బడిన విషయం. ఉభయ సేనల మధ్య యుద్ధం జరగటం నిమిత్తమాత్రం. రచయిత తనమటుకు తాను యుద్ధాదులను నిషిద్ధ కర్మలుగా భావించే వారు కాదనీ, అందుకే సమర సంఘటనలను అలా ప్రతిపాదించాడని అంటే అన వచ్చు. కాని భారతం చదివిన తర్వాత నాకు మరో విధమైన భావం కలిగింది. వ్యాసులవారు ఇంత మనోహరమైన గ్రంథాన్ని రచించి యుద్ధం నిరర్థకమనే నిరూపించారు. కౌరవులు ఓడిపోయినా, పాండవులు గెలిచినా దాని వల్ల సాధించిందేమీ లేదు. గెలిచిన వాళ్ళలో ఎంతమంది మిగిలారు? వాళ్ళకు మిగిలింది ఏమిటి? కుంతీ దేవి స్థితి ఏమిటి? ఈ నాడు యాదవ కులం ఎక్కడ ఉంది?

ముఖ్యంగా చెప్పదలచుకున్న విషయం యుద్ధ వర్ణన కానీ హింసాను శంస కానీ కానప్పుడు దానిని గురించి నొక్కి వక్కాణించటం అప్రస్తుతమే అవుతుంది. కొన్ని శ్లోకాలు అహింసను సమర్థించటం లేదని అనిపించినంత మాత్రాన 'గీత' సమస్తం హింసాను కీర్తనమని చెప్పటం సమంజసం కానేరదు.

కవి అయిన వాడు ఒక గ్రంథాన్ని రచించేటప్పుడు దానిలో ఇమిడిన అన్ని అర్థాలనూ ఊహించడు. నిజానికి కావ్య రచన కవి ఊహలను అతిక్రమించిపోతుంది. అదే కావ్యంలోని కమనీయత. కవి తన తన్మయత్వంలో తలపెట్టిన సత్యాన్ని ప్రతిపాదిస్తాడే కాని అది అతని జీవితంలో ప్రత్యక్షం కావలసిన అవసరం లేదు. అందుకనే చాలామంది కవుల జీవితం వాళ్ళ కావ్యార్థంతో సరి తూగదు. 'గీత'లో చెప్పబడిన ముఖ్య విషయం హింస కాదు, అహింస-అనే విషయం ఉపక్రమంలోని రెండవ అధ్యాయం. ఉపసంహారంలోని 18 వ అధ్యాయం చదివితే చక్కగా తెలిసిపోతుంది. మధ్య భాగం చూచినా అదే భావం ఏర్పడుతుంది. రాగద్వేషాలు, క్రోధం లేకుండా హింస జరగదు. క్రోధాదులను జయించి గుణాతీత స్థితిని అందుకునేందుకు 'గీత' మనల్ని తయారు చేస్తుంది. గుణాతీతుడి మనస్సులో క్రోధం ఉండనే ఉండదు. అర్జునుడు తన విల్లును ఎక్కు పెట్టి చెవులదాకా అంబును లాగినప్పుడు అతని అరుణారుణ నేత్రాలు నాకు ఇప్పుడూ కనిపిస్తాయి.

అహింసను సాధించేందుకు తాను యుద్ధం చేయనని అర్జునుడు ఎప్పుడు చెప్పాడు? అంతకు ముందు అతను ఎన్నో యుద్ధాలు చేశాడు. ఉన్నట్టుండి అతనికి మోహావేశం కలిగింది. అందువల్ల అతడు తన వాళ్ళను సంహరించేందుకు ఇష్ట పడలేదు. తన దృష్టిలో పాపిష్ఠులైన వాళ్ళను తాను చంపనని అర్జునుడు చెప్పాడా? శ్రీకృష్ణుడు అంతర్యామి. అర్జునుడి మనస్సులో ఆవేశించిన ఈ క్షణిక మోహం ఆయనకు తెలిసిపోయింది. అందుకనే ఆయన అంటారు: "నీవు చాలా హింస చేశావు. ఇప్పుడు అకస్మాత్తుగా ప్రజ్ఞాభినయం చేసి అహింసను అభ్యసించలేవు. ఆరంభించిన పనిని పర్యవసానం వరకూ చేసి తీరాలి." గంటకు 40 మైళ్ళ వేగంతో వెళ్ళే రైలు బండిలో కూర్చున్న ప్రయాణికుడు అకస్మాత్తుగా ప్రయాణం మీద విసిగి రైలు బండిలోనుంచి క్రిందకు దూకితే అతడు ఆత్మ హత్య చేసుకున్నవాడిగానే పరిగణింపబడుతాడు. రైలు బండిలో ప్రయాణం చేయటంలోని మిథ్యాత్వాన్ని నిరూపించినట్టు అది కానేరదు. అర్జునుడి స్థితి కూడా అలాంటిదే. అహింసను ఆశించే కృష్ణుడు కూడా ఆ పరిస్థితిలో అర్జునుడికి మరో విధంగా సలహా చెప్పలేదు. అంత మాత్రాన 'గీత' లో హింస బోధింపబడిందని వ్యాఖ్యానించటం సమంజసం కాదు. అలా చెప్పటం శరీర యాత్రకోసం అప్పుడప్పుడు హింస అవసరం కాబట్టి హింస చేయటమే ధర్మమని చెప్పినట్టవుతుంది. సూక్ష్మ బుద్ధి గలవాళ్ళు హింసామయ శరీరం నుంచి అశరీర తత్వాన్ని

అంటే మోక్షాన్ని సాధించటమే ధర్మమని బోధిస్తారు.

కాని ధృతరాష్ట్రుడు ఎవరు? దుర్యోధనుడు, యుధిష్ఠిరుడు, అర్జునుడు ఎవరు? కృష్ణుడు ఎవరు? వీరంతా చరిత్రకు సంబంధించిన వ్యక్తులేనా? 'గీత' లో వర్ణించ బడింది వాళ్ళ స్థూలమైన స్వరూప స్వభావాలేనా? ఉన్నట్టుండి అర్జునుడు ప్రశ్నిస్తాడు, కృష్ణుడు 'గీత'నంతా బోధిస్తాడు. అర్జునుడు తన మోహమంతా కూడా విచ్ఛిన్నమైపోయిందని చెప్పి కూడా కృష్ణుడు చెప్పిందంతా మరచి పోతాడు. కృష్ణుని చేత మళ్ళీ 'అను గీత' చెప్పించుకుంటాడు.

నా దృష్టిలోదుర్యోధనాదులు ఆసురీ వృత్తికీ, అర్జునాదులు దైవీ సంపదకు ప్రతినిధులు. ఈ శరీరమే ధర్మ క్షేత్రం. ఇందులో ద్వంద్వ యుద్ధం నిరంతరం సాగుతూనే ఉంటుంది. అనుభవజ్ఞులైన ఋషులు, కవులు ఆ సంఘర్షణను తదనుగుణంగా వర్ణిస్తూ ఉంటారు. కృష్ణుడు అంతర్యామి. శుద్ధమైన అంతఃకరణంలో గడియారంలాగా 'టిక్ టిక్' అని ధ్వనిస్తూ ఉంటాడు. అంతఃకరణానికి చిత్తశుద్ధి అనే 'కీ' ఇవ్వకపోతే అందులో అంతర్యామి నివసించినా ఆయన చేసే అంతర్ధ్వని మోగి మోగి ఆగిపోతుంది.

ఇంతకూ చెప్ప దలచింది ఏమిటంటే ఇందులో స్థూల యుద్ధానికి అవకాశమే లేదు. అహింస అంటే ఏమిటో తెలియని వాళ్ళకు మీరు పిరికిపందలు కండని ఇందులో చెప్పలేదు. భయపడే వాడు, సంచయ కర్త, విషయ లోలుడు హింసా పూర్వకమైన పోరాటమే చేస్తాడు. కాని అది అతని ధర్మం కాదు. ధర్మం ఒక్కటే. అహింస అంటే మోక్షం మోక్షం అనేది సత్యనారాయణ సాక్షాత్కారం. ఇందులో వెన్ను చూపించి పారిపోవటం అనే ప్రసక్తే లేదు. ఈ వింత ప్రపంచంలో హింస అనేది జరుగుతూనే ఉంటుంది. దానిని తప్పించుకునే మార్గం 'గీత' చూపిస్తుంది. కాని పిరికితనంతో పారిపోయినంత మాత్రాన హింసనుంచి తప్పించు కోలేవని గీత చెబుతుంది. పారిపోయేందుకు చూచేవాడు చనిపోనన్నా చనిపోతాడు, చంపనైనా చంపుతాడు.

ప్రశ్న కర్త ఉదహరించిన శ్లోకాలలోని ఆంతర్యం ఇప్పటికైనా గ్రహించలేకపోతే అతనికి తెలియ చెప్పటం నాకు సాధ్యం కాదు. ఈశ్వరుడు సర్వ .శక్తి సంపన్నుడైన కర్త, భర్త, సంహర్త. అలా ప్రవర్తించటమే ఆయన స్వభావం. ఇందులో సందేహమేమీ లేదు. సృష్టించిన వాడు లయింపజేసేందుకు కూడా అధికారాన్ని తన చేతిలో పెట్టుకుని ఉంటాడు. అయినా అతడు ఎవరినీ సంహరించడు. కారణం

అకర్తృత్వం. అతడు ఏమీ చేయడు. జన్మించిన వాడు మరణించక తప్పదు. మరణమే జననానికి పర్యవసానం. ఈశ్వరుడు కూడా ఈ నియమాన్ని ఉల్లంఘించలేడు. అది అతని దయ. ఈశ్వరుడే విచ్చలవిడిగా ప్రవర్తిస్తే, ఇక మన గతి ఏమవుతుంది?



## 27

# ఆర్సికేరే బహిరంగ సభలో ఇచ్చిన ఉపన్యాసం

శ్రీ కృష్ణుని జీవితం మనకు అందించే సందేశం ఏమిటో మనకు తెలియదు. మనం 'గీత' చదవం. మన పిల్లలచేత 'గీత' చదివించేందుకు కూడా మనం ప్రయత్నించం. 'గీత' దివ్యమైన గ్రంథం. ఏ మతం వాళ్ళయినా, ఏ వయస్సు వాళ్ళయినా, ఏ దేశానికి చెందిన వాళ్ళయినా ఈ గ్రంథాన్ని గౌరవ భావంతో చదువుకొని తమ తమ మతాలలోని సిద్ధాంతాలను ఇందులో చూడగలరు. మనం జన్మాష్టమి నాడు కృష్ణుణ్ణి స్మరించి 'గీత' పఠించి, అందులో చెప్ప బడ్డ విషయాలను గమనించి అనుసరించి నట్లయితే ఈనాటి దుర్దశకు మనం గురి అయి ఉండేవాళ్ళం కాదు. శ్రీ కృష్ణుడు తన జీవితమంతా ప్రజా సేవకే వినియోగించాడు. ఆయన నిజంగా జనార్ధనుడు. ఆయన తలచుకుంటే కురుక్షేత్రంలో సైన్య సంచాలనం చేయగలిగేవాడు. కాని పార్థసారథిగా ఉండటమే ఆయనకు అభీష్టమయ్యింది. ఆయన జీవితమంతా ఒక అవిచ్ఛిన్నమైన కర్మ గీత. ఆయన గర్విష్ఠి అయిన దుర్యోధనుడు ఏర్పాటు చేసిన మిష్టాన్నాన్ని నిరాకరించి వినయపూర్వకంగా విదురుడు సమర్పించిన సాత్విక భోజనాన్ని స్వీకరించారు. శ్రీ కృష్ణుడు బాల్యంలో ఆవులను మేపే వాడు. ఇప్పుడు కూడా మనం ఆయన్ని గోపాలుడుగా స్మరిస్తాం. కాని ఆయన్ని ఉపాసించే మనం ఈ నాడు గోవును పూర్తిగా ఉపేక్షిస్తున్నాం. ఆది కర్ణాటకులు గోవులను చంపి గోమాంసం తింటారు. అందు వల్ల మన పిల్లలకు, రోగులకు ఆవు పాలు లభించటం లేదు. శ్రీ కృష్ణుని

---

1.9.1927, పుటలు 410-411, ఖండం 34, గాంధీ వాఙ్మయం

జీవితంలో నిద్ర, సోమరితనం లాంటివి కనిపించనే కనిపించవు. ఆయన వంశజులం మనం పనికిరాని పని దొంగలమైనాం. మన పని మన చేతులతో చేసుకోవటం పూర్తిగా మరచి పోయాం. కృష్ణ భగవానుడు భగవద్గీతలో మనకు భక్తి యోగాన్ని బోధించాడు. కర్మ మార్గమే భక్తి మార్గం. మనం భక్తులం కావాలనుకున్నా, జ్ఞానులం కావాలనుకున్నా ఆ లక్ష్యాన్ని పొందేందుకు ఏకైక మార్గం కర్మ మార్గం-అని లోకమాన్య తిలక్ తెలియపరిచారు. కాని అది స్వార్థ బుద్ధితో కాక పరమార్థ భావనతో చెయ్యాలి. స్వార్థంతో చేసిన పని బంధనకు దారి తీస్తుంది. పరమార్థ సిద్ధికోసం చేసింది ముక్తిని ప్రసాదిస్తుంది. హిందువులు, మహమ్మదీయులు, క్రైస్తవులు, పురుషులు, స్త్రీలు, బాలబాలికలు అందరూ కలిసి నిస్వార్థ భావంతో చేయగల పని ఏదయినా ఉందా అని నేను చాలా యోచన చేసి సూత్ర యజ్ఞంలో అలాంటి గుణం కని పెట్టాను. నూలు వడకటం వల్ల మనం భగవంతుడి పేరిట బీదలకు సేవ చేయగలుగుతాము. ప్రజల శిథిలాంగాలను బలిష్ఠం చేయగల శక్తి ఇందులో ఉంది. మనం నిజంగా భక్తులం కావాలంటే బ్రాహ్మణుణ్ణి, చండాలుణ్ణి సమ దృష్టి తో చూడాలని కూడా కృష్ణ భగవానులు మనకు బోధించారు. ఇదే నిజమైతే హిందూ మతంలో అస్పృశ్యతకు ఆస్కారమే ఉండకూడదు. మీ మనసులో ఇలాంటి మూఢ విశ్వాసం ఇంకా పాదుకుని ఉంటే ఈనాడు-జన్మాష్టమినాడు-పర్వ దినంలో దాన్ని పరిహరించి ఆత్మను శుద్ధి చేసుకోవాలి. నిజమైన నిష్ఠా భావంతో 'గీత'ను సేవించే వ్యక్తి ఎవరైనా సరే హిందువులకూ, మహమ్మదీయులకూ మధ్య భేద బుద్ధిని పాటించడు. ఎందుకంటే, ఎవరు ఏ పేరిట నన్ను ఉపాసించినా అది నిజమైన ఉపాసన అయితే అది నాకే చెందుతుందని కృష్ణ భగవానులు చెప్పారు. 'గీత' ఉపదేశించిన భక్తి, ప్రేమ, కర్మ మార్గాలలో మానవ మాత్రుణ్ణి ద్వేషించటం ఎక్కడా చెప్పబడలేదు.



28

# అనాసక్తి యోగం

ఇప్పుడు నేను గీతార్థాన్ని వివరిస్తాను.

1888-89 లో నేను తొలిసారి 'గీత'ను సందర్శించినప్పుడు అప్పుడే నాకనిపించింది గీత చారిత్రక గ్రంథం కాదని. భౌతిక యుద్ధ వర్ణనను నిమిత్తం చేసుకొని యిందులో ప్రతి మనిషి హృదయంలో నిరంతరం సాగుతూ ఉండే అంతర్యుద్ధాన్ని చిత్రించటం జరిగింది. మానవ మస్తిష్కంలో జరిగే మథనను రసవత్తరంగా ప్రతిపాదించేందుకు ఈ రూపకల్పన చేయబడింది. నామనస్సుకు స్ఫురించిన ఈ ఊహ మతాన్ని గురించీ గీతను గురించీ నిశితంగా చదివిన తర్వాత రూఢి అయిపోయింది. 'మహాభారతం' చదివిన తర్వాత నా అభిప్రాయం పూర్తిగా గట్టి పడింది. ఆధునిక పరిభాషలో నాకు మహా భారతం చారిత్రక గ్రంథంగా కనిపించదు. ఆది పర్వంలోనే దీనికి ప్రబల నిదర్శనాలు కనిపిస్తాయి. అతి మానవ పాత్రలను సృష్టించి వ్యాస భగవానులు రాజులకు ప్రజలకు సంబంధించిన చరిత్రాత్మకమైన భావాన్ని సమాప్తం చేసారు. మహా భారతంలోని పాత్రలు మూలతః చారిత్రక వ్యక్తులు కావచ్చు. కాని వ్యాసులవారు ఆ పాత్రలను ధర్మ సిద్ధాంతాలను నిరూపించేందుకు వాడుకున్నారు.

మహాభారత కర్త భౌతిక యుద్ధం యొక్క ఆవశ్యకతను నిరూపించలేదు. అది నిరర్థకమనే ఆయన చూపించారు. ఆయన గెలిపించిన సమర యోధుల చేత ఆయన విలపింప చేసారు, వాళ్ళను పశ్చాత్తప్తులను చేసారు. వాళ్ళకు జీవితంలో ఆవేదన తప్ప మరేమీ మిగల్చ లేదు.

మహాభారతం మహత్తరమైన గ్రంథం. అందులో 'గీత'కు

6.8.1931, పుటలు 94-99, ఖండం 41, గాంధీ వాఙ్మయం

సర్వోన్నతస్థానం లభించింది. అందులోని రెండవ అధ్యాయం భౌతిక యుద్ధాన్ని గురించి వివరించటం మాని స్థితప్రజ్ఞుడి లక్షణాలు బోధిస్తుంది. స్థితప్రజ్ఞుడికి సాంసారిక యుద్ధంతో ఏమీ సంబంధం ఉండేందుకు వీల్లేదు. ఈ విషయం నాకు ఆ లక్షణాలలోనే తెలిసింది. కుటుంబ కలహాల మంచి చెడ్డలను చర్చించేందుకు గాదు 'గీత' వెలసింది.

'గీత' ఉపదేశించిన కృష్ణుడు మూర్తీభవించిన శుద్ధ సంపూర్ణ జ్ఞానం. అది కల్పిత పాత్ర. అలా అని నేను కృష్ణావతారాన్ని నిరాకరించటం లేదు. పరి పూర్ణ స్వరూపుడైన కృష్ణుడు కాల్పనిక సృష్టి. పూర్ణావతార పరికల్పన తరువాత ఏర్పడింది.

అవతారమంటే శరీరధారి అయిన విశిష్ట పురుషుడు. ప్రతి జీవి కూడా భగవదంశతో జన్మించిన వాడే. కాని లౌకికంగా మనం అందరినీ అవతార పురుషులనం. ప్రతి యుగంలో సర్వ శ్రేష్ఠమైన ధార్మిక పురుషుడు ఎవరు ప్రభవిస్తాడో అతన్ని భావి కాలం అవతార పురుషుడిగా ఆరాధిస్తుంది. ఇందులో నాకేమీ దోషం కనిపించదు. ఇందువల్ల భగవంతుని ప్రాశస్త్యానికి ఏమీ లోటు ఏర్పడదు. సత్యం కూడా ఇందువల్ల ప్రతి హతం కాదు. 'నరుడు నారాయణుడు కాదు, కాని నారాయణ తత్త్వం నుంచి నరుడు వేరు కాదు'-అన్న సూక్తి నిజం. ప్రతి యుగంలో ఏ వ్యక్తిలో ధార్మిక జాగృతి లోకోత్తరంగా ఉంటుందో అతన్ని విశిష్ట వ్యక్తిగా, అవతార పురుషుడిగా లోకులు భావిస్తారు. ఈ సంప్రదాయాన్ని బట్టి కృష్ణమూర్తి పరిపూర్ణమైన అవతారం.

అవతారంపై ఈ నమ్మకం మానవ మాత్రుని ఉదాత్తమైన ఆధ్యాత్మిక మహదాకంక్షకు నిదర్శనం. ఈశ్వరునితో సారూప్యాన్ని పొందితేనే కానీ మానవుని మనస్సు కుదుట పడదు. శాంతి లభించదు. ఈశ్వర సారూప్యాన్ని పొందేందుకు చేసే ప్రయత్నాన్నే పరమ పురుషార్థం అంటారు. అదే ఆత్మ దర్శనం. అన్ని మత గ్రంథాలూ ఈ ఆత్మ దర్శనాన్ని గురించే చెబుతాయి. గీత కూడా అదే చెబుతుంది. కాని గీతా ప్రణేత ఈ తత్త్వాన్ని ప్రతిపాదించేందుకు గీత రచించలేదు. ఆత్మ దర్శనం ఎలా లభిస్తుందో దానికి ఒక సాటి లేని బాటను ఆత్మార్థికి అందించటమే 'గీత' ఉద్దేశ్యం. హిందూ మతానికి సంబంధించిన అనేక గ్రంథాల్లో అక్కడక్కడా వేరు వేరుగా కనిపించే విషయాన్ని గీత అనేక విధాలలో అనేక పదాలలో మాటి మాటికి చెప్పవలసి వస్తున్నదని కూడా వెనుదీయక చక్కగా వివరించింది.

ఆ సాటి లేని బాటే కర్మ ఫల త్యాగం.

ఈ కేంద్ర బిందువును ఆధారం చేసుకుని గీతార్థ సర్వస్వం గ్రథితమయింది. భక్తి, జ్ఞానం మొదలయినవి ఈ కేంద్ర బిందువుకు అటూ ఇటూ నక్షత్ర మండలంలాగా తమ తమ స్థానాలను అలంకరించాయి. శరీరం ఉన్నంత వరకూ కర్మ చేయక తప్పదు. కర్మను ఎవరూ తప్పించుకోలేరు. అయినప్పటికీ దేహాన్ని దేవాలయం చేసుకుంటే కర్మనుండి ముక్తి లభిస్తుందని అన్ని మతాలు చెప్పాయి. కాని ప్రతి కర్మలో కొద్దో గొప్పో దోషం అంటూ ఉండనే ఉంటుంది. మరి దోష రాహిత్యం కానిదే ముక్తి లభించదు. అలాంటప్పుడు కర్మబంధం, అంటే, దోష స్పర్శ నుంచి తప్పించుకోవటం ఎలా? ఈ ప్రశ్నకు గీత నిక్కచ్చిగా సమాధానం చెప్పింది: "నిష్కామ కర్మ ద్వారా, యజ్ఞంలా కార్యాచరణ వల్ల, కర్మ ఫలితాన్ని పరిత్యజించటం వల్ల, చేసిన పనినంతా కృష్ణార్పణం అని భావించటం వల్ల-అంటే మనో వాక్కాయాలను (త్రికరణాలను) ఈశ్వరునికి హవిస్సుగా అర్పించటం ద్వారా."

కాని నిష్కామ కర్మ లేక కర్మ ఫల త్యాగం ఊరక మాటలు చెప్పినంత మాత్రన సిద్ధించదు. అది కేవలం బుద్ధి ద్వారా సాధించే విషయం కాదు. హృదయ మంథనం వల్ల అది కుదురుతుంది. ఈ త్యాగ శక్తిని అలవరచుకునేందుకు జ్ఞానం అవసరం. ఒక విధమైన జ్ఞానాన్ని పండితులు ఆర్జిస్తారు. వేదాలను కంఠస్థం చేసుకుంటారు. కాని వాళ్ళలో చాలా మంది భోగాదులలో నిమగ్నులై ఉంటారు. మితిమీరిన జ్ఞానం శుష్క పాండిత్యంగా రూపొందకుండా ఉండేందుకు గీతాచార్యులు జ్ఞానంతో భక్తిని జోడించారు. అంతే కాదు, భక్తికి ప్రాధాన్యం ఇచ్చారు. భక్తి రహితమైన జ్ఞానం వికృత రూపాన్ని పొందవచ్చు. అందుకనే భక్తి అలవరచుకుంటే జ్ఞానం తనంతట తానే లభిస్తుందని గీత చెప్పింది. కాని భక్తి అసిధారావ్రతంలా అతి కఠినం. అందువల్లనే గీతాచార్యులు భక్తుల లక్షణాలు స్థితప్రజ్ఞుని లక్షణాలతో సమానంగా చెప్పారు.

కాబట్టి 'గీత' బోధించిన భక్తి పిచ్చి వ్యామోహం కాదు, అంధ శ్రద్ధ కాదు. గీతలో చెప్పిన భక్తికి బాహ్యాచరణతో ఎక్కువ సంబంధం లేదు. జపమాల, తిలకం, అర్ఘ్యం-వీటిని భక్తుడు ఉపయోగించ వచ్చు. కాని అవి భక్తికి నిదర్శనాలు కావు. ఎవరు ఇతరులను ద్వేషించరో, కరుణామయులో, అహంకార మమకారాలకు గురి కారో, కష్ట సుఖాలను శీతోష్ణాలను సమదృష్టితో చూస్తారో, క్షమాశీలురో, నిత్య సంతుష్టులో మాటి మాటికి మనస్సు మార్చుకోరో, తమ మనస్సును, బుద్ధిని భగవంతునికి అర్పిస్తారో, ఎవరికీ భయపడరో, ఎవరినీ భయపెట్టరో,

హర్ష శోక భయాదులకు చలించరో, పవిత్రంగా జీవితం గడుపుకుంటారో, కార్య దక్షత ఉంది కూడా తటస్థంగా ఉంటారో, శుభాశుభాలను షరిహరిస్తారో, మిత్రులనూ, శత్రువులనూ. మానావమానాలనూ సరి సమానంగా భావిస్తారో, పొగడ్తలకు పొంగకుండా తెగడ్తలకు కృంగకుండా ఉంటారో, మౌనం వహించి ఏకాంతాన్ని సేవిస్తారో, ఎవరి బుద్ధి నిలకడగా ఉంటుందో వాళ్ళే భక్తులు.

ఇలాంటి భక్తి విషయాసక్తి గల స్త్రీ పురుషులకు సాధ్యం కాదు.

దీనినిబట్టి జ్ఞానం సంపాదించటం, భక్తిని అలవరచుకోవటమే ఆత్మ దర్శనం. ఆత్మదర్శనం దీనికి భిన్నమయిన పదార్థం కాదు. ఒక రూపాయిని వెచ్చించి విషమయినా కొనుక్కోవచ్చు. ఉపయోగపడే అమృతంలాంటి వస్తువును కూడా కొనవచ్చు. కాని జ్ఞానం, భక్తి లాంటి వాటితో బంధం మోక్షం రెంటిలో దేనినయినా పొందవచ్చునని చెప్పలేము. ఈ సందర్భంలో సాధనము, సాధ్యము-రెండూ పూర్తిగా ఒకటే కాకపోయినా, దాదాపు ఒకటే. సాధన యొక్క పరిణామమే మోక్షం. గీతలో చెప్పిన మోక్షానికి మారు పేరే పరమ శాంతి.

కాని అలాంటి భక్తి జ్ఞానాలు కర్మ ఫల త్యాగమనే పరీక్షలో నెగ్గాలి. సామాన్యుల దృష్టిలో శుష్క పండితుడు కూడా జ్ఞానిగానే పరిగణింప బడుతాడు. అలాంటి వాడు ఏమీ పని చేయనక్కరలేదు. మామూలు చెంబు అటునుండి తీసి ఇటు పెట్టడం కూడా అతనికి కర్మ బంధనకు కారణమవుతుంది. యజ్ఞశూన్యుడు జ్ఞాని అయినప్పుడు చెంబు తీయటంలాంటి క్షుద్ర కార్యానికి తావే ఉండదు కదా!

సామాన్య మానవులు భగవద్ భక్తిలో లీనమై అస్తమానం జప మాలను తిప్పుకుంటూ తిరుగుతూ ఆవగింజంత పని కూడా చేయకుండా సేవాకార్యాన్ని కూడా జపానికి భంగం అని భావించే వాడిని భక్తుడంటారు. భోజనాదులు సేవించేటప్పుడు మాత్రం మాలను అవతల పెట్టి సుష్టుగా భోంచేస్తారు. రాట్నం తిప్పేందుకు గాని, రోగులకు సేవ చేసేందుకు గాని అతడు తన మాలను వదల లేడు.

ఇలాంటి జ్ఞానులనూ, భక్తులనూ సంబోధించి గీత స్పష్టంగా చెప్పింది: "కర్మను ఆచరించకుండా ఎవరూ సిద్ధిని పొందలేరు. జనకాదులు కూడా కర్మను ఆచరించటం వల్లనే జ్ఞానులయ్యారు. నా మటుకు నేను సోమరితనం మాని నా పని నేను చెయ్యకపోతే అన్ని లోకాలు నశించి పోతాయి." ఇక మరి సామాన్య మానవులను గురించి చెప్ప వలసింది ఏముంటుంది?

కాని ఒక్క విషయం గమనించాలి. ఒకవైపు కర్మ అనేది బంధనానికి హేతువు-అన్న మాట నిర్వివాదం. మరోవైపు శరీర ధారణ చేసే ప్రతి వ్యక్తి ఇష్టమున్నా లేకున్నా కర్మను ఆచరించి తీరుతాడు. మరి కర్మను ఆచరిస్తూనే కర్మ బంధాన్ని మానవుడు ఎలా తప్పించుకో గలడు? అనేది చిక్కు ప్రశ్న. ఈ ప్రశ్నకు చక్కని సమాధానం గీతలో లభించినట్లు మరి ఏ మత గ్రంథంలోనూ లభించదు. గీత చెప్తుంది: 'ఫలాపేక్ష వదలి కర్మ చెయ్యి,' 'ఏమీ ఆశించకుండా నీ పని నీవు చెయ్యి,' 'నిష్కామ భావంతో పని చెయ్యి!' ఇది ఎన్నడూ మరువకూడని గీతా సూక్తి. కర్మను వదలిన వ్యక్తి పతితుడైపోతాడు. కర్మ ఫలం వదలిన వ్యక్తి ఉన్నత శిఖరాలను చేరుకుంటాడు.

ఫల త్యాగమంటే చేసిన కర్మకు లభించే ఫలితాన్ని గురించి పట్టించుకోక పోవటం కాదు. చేసే పని ఎందుకు చేస్తున్నాము, ఎలా చెయ్యాలి అనే రెండు విషయాలూ బాగా తెలిసి చెయ్యటం చాలా అవసరం. అలా చేస్తూ కూడా ఫలాపేక్ష లేకుండా కార్య సాధన లోనే నిమగ్నుడై కార్యాచరణ చేసేవాడే ఫల త్యాగి అనిపించుకుంటాడు.

ఫల త్యాగికి ఫలితం లభించదని కూడా భావించరాదు. అలాంటి వ్యాఖ్యకు గీతలో ఏమీ ఆస్కారం లేదు. ఫల త్యాగమంటే ఫలితం మీద ఆసక్తి లేకపోవటం. నిజానికి ఫలాపేక్ష లేనివాడికి వెయ్యి రెట్లు ఫలితం లభిస్తుంది. గీత బోధించిన ఫల త్యాగం మనిషిలో ఉండవలసిన అపారమైన శ్రద్ధను పరీక్షిస్తుంది. పరిణతి మీదనే దృష్టి గలవాడు చేయవలసిన పని చెయ్యటంలో చూప వలసిన శ్రద్ధ చూపలేక పోతాడు. ఓర్పు తగ్గిపోతుంది. కోపం ఆవేశిస్తుంది. అందువల్ల చేయగూడని పని చేయ సాగుతాడు. చేస్తున్న పని వదలి మరో పని ఆరంభిస్తాడు. అందులో కూడా నిలబడక వేరే పనిలో చిక్కుకుంటాడు. కర్మ ఫలాన్ని గురించే ఆలోచించే వ్యక్తి కామాంధుడిలాగా మంచి - చెడు, నీతి - అవినీతి అనే విచక్షణ లేకుండా ప్రవర్తిస్తాడు. చివరకు తాను కోరిన ఫలితాన్ని పొందేందుకు ఎలాంటి మార్గాన్నయినా అనుసరించి దానినే ధర్మ మార్గమని భావిస్తాడు.

ఫలాపేక్ష వల్ల కలిగే ఈ దుష్పరిణామాలను గమనించే గీతాచార్యులు అనాసక్తి లేక కర్మ ఫల త్యాగం అనే సిద్ధాంతాన్ని ఆవిష్కరించి అందరికీ అర్థమయ్యే చక్కని మాటల్లో ప్రపంచానికి ప్రబోధించారు.

సామాన్యంగా ధర్మం, అర్థం అనేవి ఒకదానికొకటి సరిపోవనే అపోహ ఉంది. "వ్యాపారం, వాణిజ్యం లాంటి లోక వ్యవహారంలో

ధర్మానికి తావు లేదు. ధర్మాన్ని పాలించటం సాధ్యం కాదు. ధర్మం కేవలం మోక్ష సిద్ధికే ఉపయోగ పడుతుంది. ధర్మ రంగంలో ధర్మం, అర్థ పరధిలో అర్థం శోభిస్తాయి" అని అంటారు. గీతాచార్యులు ఈ భ్రాంతిని తొలగించారని నా అభిప్రాయం. ప్రపంచ వ్యవహారానికీ, మోక్షానికీ మధ్య భేదభావాన్ని గీతాచార్యులు సమ్మతించరు. అంతే కాదు, ధర్మాన్ని వ్యవహార జగత్తుతో సమన్వయించారు. లోక వ్యవహారంలో ఉపయోగపడని ధర్మం ధర్మమే కాదని గీత ప్రవచిస్తుందని నా అభిప్రాయం. కాబట్టి గీత చెప్పిన ప్రకారం అసక్తి రహితంగా చేసేందుకు వీలుకాని కర్మ త్యాజ్యం. దానిని వదలి పెట్టటం మేలు. బంగారం లాంటి ఈ నియమం మనిషిని ఎన్ని ధర్మ సంకటాలనుంచో రక్షిస్తుంది. ఈ సిద్ధాంతాన్ని బట్టి చూస్తే హత్య, అసత్యం, వ్యభిచారం స్వతఃసిద్ధంగా త్యాజ్యాలవుతాయి. దీని వల్ల మానవ జీవితం సరళ గతిలో సాగుతుంది. సారళ్యం వల్ల శాంతి ఉదయిస్తుంది.

ఇలా ఆలోచించగా, ఆలోచించగా నాకు అనిపించింది -గీత ఉపదేశించిన తత్వాన్ని ఆచరణలో పెట్టే వ్యక్తి సత్యాన్నీ, అహింసనూ సహజంగానే పాటించి తీరుతాడు. ఫలాపేక్ష లేకుంటే అసత్యం చెప్పాలని కానీ, హింస చేయాలని కానీ అనుకోనే అనుకోడు. హింసకూ, అసత్యానికీ మూల కారణం ప్రతిఫలాపేక్షే అవుతుంది.

కాని అహింసను ప్రతిపాదించటం గీత లక్ష్యం కాదు. ఎందుకంటే గీతకు ముందే అహింస పరమ ధర్మంగా భావించబడుతూ ఉండేది. అనాసక్తి సిద్ధాంతం గీతలో ముఖ్యమైన ప్రతిపాద్య విషయం. గీత రెండో అధ్యాయంలోనే ఈ విషయం స్పష్టమవుతుంది.

కాని ఒక వేళ గీతకు అహింస సమ్మతమై అనాసక్తిలో అహింస సహజంగా నిహితమై ఉంటే గీతాచార్యులు భౌతిక యుద్ధాన్ని ఉదాహరణగా ఎందుకు తీసుకున్నారు? దీనికి సమాధానం ఇది-గీతోపదేశం జరిగిన యుగంలో అహింస ధర్మ సమ్మతంగా ఉండేది. అయినా భౌతిక యుద్ధాలు సామాన్యంగా జరుగుతూనే ఉండేవి. అందువల్ల గీతాచార్యులు భౌతిక యుద్ధాన్ని ఉదాహరించేందుకు సందేహించ లేదు. సందేహించ వలసిన అవసరం కూడా లేదు.

కాని ఫల త్యాగం యొక్క నిహితార్థాన్ని అవగాహన చేసుకునే సందర్భంలో అహింసను గురించి గీతా ప్రణేత యొక్క భావ పరిధిని గురించి చర్చించ వలసిన అవసరం లేదు. కవి ఒక గొప్ప సిద్ధాంతాన్ని ప్రపంచానికి అందిస్తాడు. కాని తాను ప్రతిపాదించిన సిద్ధాంతాన్ని గురించి

తనకు పూర్తిగా తెలుసని గానీ అలా తెలుసుకుని దానిని సవిస్తరంగా స్పష్టంగా వివరిస్తాడని గానీ చెప్పలేము. అందులోనే కావ్య గరిమ, కవి మహిమ ఉంటాయి. కవి ఆశయానికి సరిహద్దులుండవు.

మానవ మనో వికాసంలాగానే, మహా కవుల మహా వాక్యాల ఆశయం కూడా విస్తరిస్తూ ఉంటుంది. భాషల చరిత్రను పరిశీలించి చూస్తే గొప్ప గొప్ప పదాల అర్థాలు నిరంతరం విస్తృతి చెందుతున్నట్టు తెలుస్తుంది. గీతలో వచ్చిన పదజాలం విషయంలో కూడా ఈ మాట నిజం. గీతా రచయిత అంతకు ముందు వేరు వేరు అర్థాలలో రూఢమైపోయిన అనేక పదాలను విస్తృతార్థంలో ఉపయోగించాడు. గీతను స్థూలంగా పరిశీలించినా ఈ విషయం గోచరిస్తుంది.

గీతకు పూర్వ యుగంలో యజ్ఞయాగాదుల్లో పశుహింస బహుశా సమ్మతం అయి ఉండ వచ్చు. కాని గీత చెప్పే యజ్ఞంలో దాని వాసన కూడా కనిపించదు. గీతలో జపయజ్ఞాన్ని అన్ని యజ్ఞాలకూ మకుటాయమానంగా కీర్తించటం జరిగింది. గీత మూడో అధ్యాయంలో పరోపకారానికి శరీరాన్ని వినియోగించటమే యజ్ఞంగా నిరూపించటం మనం గమనించవచ్చు. మూడు నాలుగు అధ్యాయాలను సమన్వయం చేసుకుని చూస్తే యజ్ఞానికి మరి ఎన్నో వ్యాఖ్యలు కనిపిస్తాయి. కాని పశు హింస అనే అర్థం ఎక్కడా కనిపించదు.

గీతలోని సన్న్యాస శబ్దం కూడా ఇలాంటిదే. కేవలం కర్మలను త్యజించటం సన్న్యాసమని గీత ఎంత మాత్రం అంగీకరించదు, సహించదు కూడాను. గీతలో చెప్పిన సన్న్యాసి కర్మిష్ఠుడు. అయినా అకర్మలో కూడా ఆరితేరిన వాడు. ఈ విధంగా గీతా రచయిత ప్రసిద్ధ పదాలను విస్తృతార్థంలో వాడి, తాను ప్రవేశపెట్టిన నూతన పదాలను కూడా ఇలాగే వ్యాపకార్థంలో గ్రహించవలసిందని పాఠకులకు సూచించినట్టు తోస్తుంది. పూర్తిగా కర్మ ఫల త్యాగం చేసిన వ్యక్తి కూడా భౌతిక యుద్ధానికి సన్నద్ధుడు కావచ్చునవే అర్థం గీత మాటల్లోనూ వాక్యాల్లోను స్ఫురిస్తే స్ఫురించ వచ్చు. కాని దాదాపు నలభై సంవత్సరాల నుంచీ గీతార్థాన్ని నిత్య జీవితంలో ప్రవేశ పెట్టేందుకు ప్రయత్నించటం వల్ల నాకు తోచింది ఏమిటంటే 'సత్యాన్ని, అహింసను పరిపూర్ణంగా పాటించని వ్యక్తికి కర్మ ఫలత్యాగం అసాధ్యమయిన పని' అని.

గీత సూత్ర గ్రంథం కాదు. అది మహత్తరమైన ధర్మ కావ్యం. మనం ఎంత లోతుకు వెళ్ళితే అందులో మనకు అంతటి అర్థగాంభీర్యం కనిపిస్తుంది. నవ్యనవనీతంలాంటి అర్థాలు స్ఫురిస్తాయి. గీత జన

సామాన్యం కోసం రచించ బడింది. అందువల్ల అందులో ఒకే విషయాన్ని అనేక విధాలుగా చెప్పటం జరిగింది. గీతలో వాడిన గంభీర పదాలకు పోను పోను ప్రతి యుగంలో అర్థాలు మారుతాయి, వ్యాప్తిని చెందుతాయి. కాని గీత ఉపదేశించే మూల మంత్రం మాత్రం మారదు. ఈ మంత్రాన్ని జీవితంలో ఎలా సాధించి సిద్ధిని పొందాలి అనే విషయాన్ని మనస్సులో ఉంచుకొని జిజ్ఞాసువులు గీతాంతర్గత పదాలకు తమకు తోచిన అర్థాలు చెప్పుకో వచ్చు.

గీత విధి నిషేధాలను చెప్పే సంగ్రహ గ్రంథం కాదు. ఒకరికి కర్తవ్య కర్మ అయింది మరొకరికి నిషిద్ధం కావచ్చు. ఒక కాలంలో ఒక దేశానికి విహితమైన కర్మ మరో కాలంలో మరో దేశానికి నిషిద్ధం కావచ్చు. కాబట్టి నిషిద్ధం కేవలం ఫలాసక్తి. విహితం అనాసక్తి.

గీతలో జ్ఞాన మహిమ కొనియాడబడింది. కాని గీత బుద్ధి గమ్యం కాదు, హృదయ గోచరమయింది. కాబట్టి శ్రద్ధారహితులకు అది పనికి రాదు. గీతాచార్యులు చెప్పనే చెప్పారు:

"తపస్సు చేయని వాడికి, భక్తి లేని వాడికి, వినాలని కుతూహలం లేని వాడికి, నన్ను ద్వేషించే వాడికి, నీవీ జ్ఞానం చెప్పకు. కాని యీ పరమ రహస్యమైన జ్ఞానాన్ని ఎవరు నా భక్తులకు అందజేస్తారో వాళ్ళు నా పరమ భక్తులు కావటం వల్ల నన్ను పొందుతారు. అంతేకాక, ఎవరు ద్వేష భావం లేకుండా శ్రద్ధతో ఈ జ్ఞానాన్ని వింటారో, వాళ్ళు శ్రవణ మాత్రం చేత ముక్తులై పుణ్యాత్ములు చేరే లోకాలకు చేరుకుంటారు." (18 వ అధ్యాయం: శ్లోకాలు 67, 68, 71.)



29

# భక్తి యోగం

నా మటుకు నేను ఏ కష్టం వచ్చినా గీతా మాత దగ్గరికి పరుగెత్తి వెళ్లాను. ఇంత వరకూ ఆమె నన్ను ఆదుకుంటూనే ఉంది. ఇతరులకు కూడా ఇలాగే-బహుశా ఇంతకంటే మిన్నగానే-ఆమె ఓదార్పు లభిస్తూనే ఉంటుంది. సరి యైన రీతిలో ఆమెను ఆశ్రయించి ఆమె అనుగ్రహాన్ని ఆశించాలే కాని ఆమె ఎవరినీ ఎన్నడూ నిరాశపరచదు. అర్థం చేసుకునే పద్ధతిని సరిగా అనుసరిస్తే నూతన చైతన్యం పొందటం కూడా అసాధ్యం కాదు.

ఈ నాడు నేను పన్నెండో అధ్యాయానికి సారాంశం చెప్తాను ఇది భక్తి యోగం. వివాహ సమయంలో నూతన దంపతులకు పంచ యజ్ఞాలలో ఒకటిగా దీనిని కూడా కంఠస్థం చేసుకుని దీనిని మననం చేసుకుంటూ ఉండవలసిందని మనం చెప్తాం. భక్తి లేకుంటే జ్ఞానం, కర్మ శుష్కమైపోతాయి. అవి బంధనగా రూపొందే అవకాశం ఉంటుంది. కాబట్టి భక్తి భావంతో 'గీత'ను మనన చేసుకొనేందుకు ఉపక్రమించాలి.

అర్జునుడు కృష్ణ భగవానులను ప్రశ్నించాడు: 'సాకారంగా, నిరాకారంగా భగవంతుని భావించి సేవించే వారిలో ఎవరి భక్తి మిన్న?'

భగవానులు సమాధానం చెప్పారు: 'నన్ను సాకారంగా భావించి శ్రద్ధతో ధ్యానించి నాలో లీనమైన వాళ్ళు నా భక్తులు. కాని ఎవరు నన్ను నిరాకార రూపంలో ఆరాధించి, అందుకోసం ఇంద్రియ నిగ్రహాన్ని అలవరచుకొని, సకల జీవులను సమభావంతో చూచి వారిని సేవిస్తూ ఉంటారో, వాళ్ళు కూడా నన్నే పొందుతారు. అందువల్ల ఉభయులలో ఎవరు శ్రేష్ఠులని చెప్పటం సాధ్యం కాదు. నిరాకార నిర్గుణ రూపంలో

---

4.11.1930, పుటలు 273-274, ఖండం 44, పుటలు 131-132, ఖండం 49, గాంధీ వాఙ్మయం

ఈశ్వరుణ్ణి భావించి భజించటం శరీర ధారులకు కష్టసాధ్యమౌతుంది. ఆ స్వరూపం మన కల్పనకు అతీతమైపోతుంది. కాబట్టి దేహధారులెందరో తెలిసీ తెలియక సాకార దైవాన్నే భజిస్తారు. అందుకని నీవు నా సాకార విశ్వ రూపాన్నే ధ్యానించి అందులో నీ మనస్సు లయం చేసుకో. సర్వస్వం ఆ రూపానికి అర్పించు. అలా చేయలేకపోతే మనో వికారాలను అదుపులో ఉంచుకునేందుకు ప్రయత్నించు. అంటే యమ నియమాదుల ద్వారా మనస్సును స్వాధీనం చేసుకో. అది కూడా సాధ్యం కాకపోతే నీవు చేసేదంతా నా కోసమే చేస్తున్నాననే భావంతో అన్ని పనులూ చేస్తూ ఉంటే నీ యందలి మోహం, మమకారం క్షీణించి.నీ మనస్సు నిర్మలం పరిశుద్ధం అయిపోతుంది. నీలో భక్తి రసం ఉదయిస్తుంది. అది కూడా చేత కాక పోతే కర్మ ఫలాన్ని త్యజించు. అంటే ఫలాపేక్ష పెట్టుకోకు. నీవు చేయవలసిన పని నీవు చేస్తూ ఉండు. ఫలితంపై మానవుడికి అధికారం లేదు. ఎన్నో పరిస్థితులు కలసి వస్తేనే ఫలోదయం కలుగుతుంది. కాబట్టి నీవు కేవలం నిమిత్త మాత్రుడివికా. నేను చెప్పిన నాలుగు పద్ధతులలో ఎక్కువ తక్కువలు లేవు. అన్నీ సమానమే. నీకు ఏది అనుకూలంగా ఉంటే దాన్ని అనుసరించి భక్తి రసాన్ని ఆస్వాదించు. పైన చెప్పిన యమ నియమం, ప్రాణాయామం, ఆసనం మొదలైన వాటికంటే శ్రవణం, మననం మొదలైన వాటితో కూడిన జ్ఞాన మార్గం సులభం అని అనిపిస్తుంది. దానికంటే ఉపాసనతో కూడిన ధ్యానం సులభంగా తోస్తుంది. ధ్యానం కంటే కూడా కర్మఫల త్యాగం సులభం. అందరికీ ఒకే మార్గం సులభం కాకపోవచ్చు. కొందరు అన్ని మార్గాలను అవలంబించ వచ్చు కూడాను. అన్ని మార్గాలు ఒకదానితో ఒకటి ముడి పడే ఉంటాయి. ఏ మార్గాన్ని అనుసరించినా భక్తి నీకు ధ్యేయంగా ఉండాలి. ఏ మార్గంలో భక్తి సిద్ధిస్తుందో ఆమార్గంలో భక్తిని సాధించు.

భక్తుడి లక్షణాలు నేను నీకు చెప్తాను: భక్తుడు ఎవరినీ ద్వేషించడు, ఎవరితోనూ వైరం పెట్టుకోడు. ప్రతి జీవితో మైత్రిని పెంచుకుంటాడు, ప్రాణికోటి పట్ల దయాభావాన్ని అలవరచుకుంటాడు, అందుకోసం మమకారాన్ని వదలి తన్ను తాను విసర్జించి శూన్యప్రాయుడవుతాడు, సుఖ-దుఃఖాలను సమానంగా చూస్తాడు. ఎవరైనా తనను ద్వేషిస్తేవాళ్ళను క్షమిస్తాడు (తాను కూడా తన దోషాలను ప్రపంచం క్షమించాలని పరితపిస్తాడు కాబట్టి), ఎంతకంతకే తృప్తిపడుతుంటాడు, తాను చేసిన శుభ సంకల్పాలనుంచి చలించడు, అంతఃకరణ శుద్ధిగా తన సర్వస్వం నాకు సమర్పిస్తాడు, అతని వల్ల లోకులు ఉద్విగ్నత చెందకూడదు,

అలాగే లోకుల వల్ల అతను ఉద్విగ్నుడు కాడు. సంతోషం, సంతాపం, భయం అతన్ని స్పృశించవు. అతనికి దేనిపై కూడ వ్యామోహం ఉండదు పవిత్ర భావంతో నేర్పుతో ప్రవర్తిస్తూ పేరాశలకు దూరంగా ఉంటాడు. అపేక్షలను అరంభంలోనే ఉప సంహరించుకుంటాడు. ఒకసారి ఏదయినా నిర్ణయించిన తర్వాత మనసు మార్చుకోడు. పరిణామం శుభమయినా అశుభమయినా రెండింటినీ త్యజించి నిశ్చింతగా నియత కార్యం నిర్వహిస్తాడు. అతనికి శత్రువు లేడు, మిత్రుడూ లేడు. అభిమానం లేదు అవమానం లేదు. ఏది లభిస్తే దానితో తృప్తి పడుతూ ఏకాంతచిత్తుడై ప్రశాంతంగా మౌనంగా వ్యవహరిస్తాడు. ఎలాంటి పరిస్థితులలో కూడా మనస్థైర్యాన్ని వదలడు. ఇలా శ్రద్ధా భక్తులతో ప్రవర్తించే వ్యక్తి నాకు ఇష్టమైన భక్తుడు.

## 30

# గీతాధ్యాయి

'గీత' పట్ల నా గౌరవ భావాన్ని గురించి 'హరిజన్' పాఠకులకు తెలుసు. 'గీత' లాంటి గ్రంథాలను కంఠస్థం చేయటం చాలా వాంఛనీయమని నేను ఎప్పుడూ భావిస్తూనే ఉంటాను కాని నా మటుకు నేను ఎన్ని సార్లు ప్రయత్నించినా 'గీత' అధ్యాయాలన్నీ కంఠస్థం చెయ్యలేక పోయాను. ఏదయినా వల్లె వేయటం నావల్ల కాని పని అని నాకు తెలుసు. అందు వల్ల 'గీత'ను కంఠస్థం చేసిన వ్యక్తి ఎవరయినా నాకు తటస్థ పడితే నా మనస్సులో వారి పట్ల ఆదర భావం జాగృతమౌతుంది. నేను తమిళనాడులో పర్యటించినప్పుడు ఇద్దరు వ్యక్తులు నాకు కనిపించారు. మదురలో ఒక పురుషుడు, దేవకొట్టలో ఒక మహిళ. మదురలో కనిపించిన వ్యక్తి వ్యాపారి. ఆయన అంత ప్రసిద్ధ వ్యక్తి కాదు. రెండో వ్యక్తి పేరు పార్వతీ బాయి, న్యాయమూర్తి సదాశివ అయ్యర్ కూతురు. శ్రీ అయ్యర్ తన జీవిత కాలంలోనే 'గీత' సమస్తం కంఠస్థం చేసి సర్వోత్తమంగా గీతా గానం చేసిన వ్యక్తికి బహుమతి ఇచ్చే ఏర్పాటు చేశారు. కాని భగవద్గీతను కంఠస్థం చేసి గానం చేసే గీతాధ్యాయులు ఒక్క విషయం గుర్తుంచుకోవాలి. పారాయణం చేసినంత మాత్రాన గీతార్థం చరితార్థం కానేరదు. ఆ భావాలను అవగాహనం చేసుకుని వాటిని మననం చేసుకుంటూ అంతరంగంలో ప్రతిష్ఠించు కునేందుకు పఠన పాఠనాలు సహకరిస్తాయి. నిరంతరం అభ్యాసం చేస్తే రామ చిలుక కూడా గీతను వల్లించి పలుక గలదు. కాని అలా చేసినప్పటికీ చిలుక చిలుకగానే ఉంటుంది. కాని జ్ఞానిగా మారలేదు. గీతాధ్యాయి, గీతాచార్యుడు అపేక్షించినట్లు, విశాల దృక్పథంతో ఒక

2.2.1934, పుటలు 100-101, ఖండం 57, గాంధీ వాఙ్మయం

యోగిగా రూపొందాలి. 'గీత'ను అనుసరించి చరించే గీతాభ్యాసకులు మనో వాక్కాయ కర్మలను సమన్వయ పరచుకుంటూ ఈ మూడింటిని సమకూర్చుకొని పోవాలనే 'గీత' ఆశిస్తుంది. చెప్పే మాటలు, చేసే పనులు ఆలోచనలకు అనుగుణంగా లేనప్పుడు అది ఆత్మ వంచన అవుతుంది. తన్ను తాను మోసపుచ్చుకున్నట్టవుతుంది.

## 31

# అహమదాబాద్ హరిజన ఆశ్రమంలో చేసిన ప్రసంగం

నేను 'గీత' ను భజించే భక్తుణ్ణి. నిర్వివాదమైన కర్మ సిద్ధాంతం మీద నాకు పూర్తి నమ్మకం ఉంది. ఎంత చిన్న సంఘటన జరిగినా అకారణంగా జరగదు. మనో వాక్కాయములతో త్రికరణ శుద్ధిగా 'గీత'ను అనుసరించి చరించే వ్యక్తికి జబ్బు చేయకూడదని నా భావన. రక్త నాళాలలో ప్రసరించే రక్తం పై ఈ ఒత్తిడి శారీరకమైన శ్రమ, మానసికమైన ఆందోళన వల్లనే ఏర్పడుతుందని డాక్టర్లు చెప్తారు. అదే నిజమైతే బహుశా నేను అనవసరంగా మనో వ్యధను కొని తెచ్చుకుంటున్నాను. వ్యర్ధమైన వాటిని గురించి బాధ పడుతున్నాను, నాకు తెలియకుండానే లోలోపల కామ క్రోధాలకు ఆశ్రయం ఇస్తున్నాను. నేను ఎంత ప్రయత్నించినా ఏదో ఒక సందర్భంలో లేక సంఘటనలో నా మనశ్శాంతికి భంగం కలిగిందంటే దాని అర్థం గీత బోధించిన ఆదర్శాలలో లోపం ఉందని కాదు. నా శ్రద్ధలోనే ఏదో న్యూనత ఏర్పడిందని భావించాలి. 'గీత' నిరూపించిన ఆదర్శాలు శాశ్వత సత్యాలు. కాకపోతే మనం వాటిని సరిగా అర్థం చేసుకుని పాటించటంలో పొరబాట్లు రావచ్చు.

---

29.2.1936, పుటలు 204-205, ఖండం 62, గాంధీ వాఙ్మయం



32

# అహింస

ఎవరైనా సరే తాను అహింసా పరాయణుణ్ణి అని చెప్పుకుంటే ఆ వ్యక్తి యందు మనం ఆశించే లక్షణాలు కొన్ని ఉన్నాయి. అతనికి ఎవరయినా హాని చేస్తే, హాని చేసిన వ్యక్తి పై కోపం రాకూడదు, అతనికి బదులుగా హాని చేయాలని అనుకోకూడదు. పైపెచ్చు అతనికి మేలు చేయాలనుకోవాలి. అతన్ని నోటికి వచ్చినట్లు దూషించ కూడదు. అతన్ని శారీరకంగా హింసించకూడదు. తనకు అన్యాయం చేసినా అన్యాయం వల్ల తనకు జరిగిన హానిని శాంతంగా సహించాలి. ఈ విధంగా అహింస దోష రహితమైన సహనావస్థ. పరిపూర్ణమైన అహింస అంటే ఏ ప్రాణి పట్ల కూడా ఏ మాత్రం దుర్భావం లేకుండా ఉండటం. అందువల్ల అహింసలో మానవ జాతి మాత్రమే కాక సమస్త ప్రాణికోటి-మనకు హాని చేసే పురుగులు, జంతువులు కూడా చేరుతాయి. మనలోని ధ్వంసాత్మక ప్రవృత్తిని పెంపొందించేందుకు వాటి సృష్టి జరగలేదు. మనం సృష్టి కర్త ఆశయాన్ని జాగ్రత్తగా గమనిస్తే ఆయన సృష్టిలో ఆ జీవులకు ఉన్న స్థానమేమిటో మనకు బోధ పడుతుంది. కాబట్టి కార్య రూపంలో అహింస యందలి అభిప్రాయం ప్రాణికోటి పట్ల సద్భావం. అదే శుద్ధ ప్రేమ. హిందూ శాస్త్రాలలో, బైబిల్‌లో, కురానులో-అన్నింటిలో నాకు ఇదే తత్త్వం గోచరిస్తుంది.

అహింస ఒక పరిపూర్ణమైన పరిస్థితి. సమస్త మానవ జాతి స్వభావ సిద్ధంగా అప్రయత్నంగా ఈ లక్ష్యం చేరుకునేందుకే పురోగమిస్తుంది. మానవుడు తనలోని నిర్దుష్టతకు ప్రతి మూర్తిగా రూపొందినపుడు దివ్య స్వరూపుడు కాడు. బహుశా అప్పుడే అతడు నిజమైన మానవుడవుతాడు.

---

9.3.1922, పుటలు 23-24, ఖండం 23, గాంధీ వాఙ్మయం

ఈ నాడు మనం కొన్ని దశల్లో మానవులం, మరికొన్ని పరిస్థితుల్లో పశువులుగా ప్రవర్తిస్తున్నాము. మనం దెబ్బకు దెబ్బతో సమాధానం చెబుతున్నాము. అలాంటి సమయంలో పళ్ళు కొరికి కళ్ళురిమి, మన ఉనికిని నిలబెట్టుకునేందుకు మనం సరియైన పని చేస్తున్నామని అజ్ఞానం వల్ల గర్వంగా చెప్పుకుంటూ ఉంటాం. హింసకు ప్రతి హింస మానవ నైజం అనీ, అలా చేయకపోతే మనం జీవించలేమని గొప్పలు చెప్పుకుంటూ ఉంటాం. కాని మన మత గ్రంథాలను పరిశీలించి చూస్తే వాటిలో ప్రతిహింసను అనివార్య కర్తవ్యంగా ఎక్కడా ప్రస్తావించినట్లు కనిపించదు. అది కేవలం ఆపద్ధర్మంగా అనుమతింపబడింది. అనివార్య కర్తవ్యం సంయమం. ప్రతి హింసను అవలంబించవలసి వచ్చినప్పుడు అనేక నియమాలను, నిబంధనలను నేర్పుగా ఓర్పుతో పాటించవలసిన అవసరం ఉంటుంది. అలా కాక సంయమం మన జీవితాన్ని సరళ సహజ మార్గంలో నడిపిస్తుంది. సంయమ రహితుడు పరిపూర్ణతను పొందనే లేడు. సహనం, సంయమం మానవ జాతికి విశిష్ట ధర్మం లాంటిది.

మన అయోగ్యత మనకు బోధపడే కొద్దీ, మన లక్ష్యం మనకు దూరమైపోతుంటుంది. కాని ప్రయత్నం చేయటం సంతుష్టికి సోపానం. అభీష్ట సిద్ధిలో ఆ ఆనందం లేదు. పరిపూర్ణ ప్రయత్నమే పూర్ణ విజయం.



## 33

# హిందువులలో కూడా వైముఖ్యం

సమగ్రమైన అహింస మీద నాకు విశ్వాసం ఉంది. ఆ రూపంలోనే దాన్ని నేను సమర్థిస్తాను. అందు చేత కొంతమంది నన్ను హిందువుగానే అంగీకరించరు. నేను ప్రచ్ఛన్న క్రైస్తవుణ్ణని కూడా వాళ్ళంటారు. భగవద్గీతలో విశుద్ధమైన అహింసా ధర్మం ఉపదేశించబడిందని చెప్పటం 'గీత'కు విపరీతార్థం కల్పించటం అని నాతో అసందిగ్ధమైన ధోరణిలో చెప్పారు. నాకు ఆత్మీయులైన హిందూ సోదరులు కొందరు కొన్ని పరిస్థితుల్లో భగవద్గీత హింసను ధర్మసమ్మతంగా బోధించిందని నాతో అన్నారు. ఇటీవల ఒక ప్రకాండ పండితుడు 'గీత'కు నేను చెప్పిన వ్యాఖ్యకు ముఖం చిట్లించుకుని నాతో అన్నారు: 'గీత'లో దైవాసుర శక్తుల మధ్య నిరంతరం జరుగుతూ ఉండే సనాతన సంఘర్షణ చిత్రింపబడిందని భావించే కొందరు వ్యాఖ్యాతల తర్కం నిరాధారం. అభ్యంతర మాలిన్యాన్ని ఏ మాత్రం వెనుదీయకుండా నిర్దాక్షిణ్యంగా నిర్మూలించటమే మన కర్తవ్యం అని 'గీత' చెప్తుంది.

అహింసను ప్రతిఘటిస్తూ బయలుదేరిన ఈ భావాలను గురించి ఇంత విపులంగా నేను ఎందుకు చెబుతున్నానంటే సాంప్రదాయిక సమస్యకు నేను చెప్పబోయే సమాధానాన్ని అర్థం చేసుకోవాలంటే ఈ భావాలను బాగా హృదయంగమం చేసుకోవాల్సి ఉంటుంది.

ప్రస్తుతం నాకు నలు వైపుల కనిపించేదంతా అహింసా ప్రసారానికి విరోధంగా ఏర్పడ్డ ప్రతి క్రియ మాత్రమే. ఒక ప్రచండమైన హింసా కల్లోలం చెలరేగినట్లుగా నాకు తోస్తున్నది. హిందూ ముస్లిం ఆందోళన అహింసను అసహ్యించుకునే ప్రవృత్తి యొక్క ఉగ్రరూపం మాత్రమే.

---

29.5.1924, పుటలు 142-144, ఖండం 24, గాంధీ వాఙ్మయం

ఈ ప్రశ్నను గురించి విచారించేప్పుడు నన్ను పూర్తిగా ఉపేక్షించవచ్చు. నా మతం ఏమిటో అది నాకూ నన్ను పుట్టించిన వాడికీ సంబంధించిన విషయం. నేను హిందువునే గనుక అయితే సమస్త హిందూ సమాజం నన్ను బహిష్కరించినా నేను హిందువుగానే ఉంటాను. అన్ని మతాలకూ పర్యవసానం అహింస-అని మాత్రం నేను చెప్తూనే ఉంటాను.

కాని నేను ఎన్నడూ అహింస యొక్క పరమ స్వరూపాన్ని ప్రజల ముందు విశదపరచ లేదు. దానికి కారణం బహుశా ఇంతటి పురాతన సందేశాన్ని ప్రపంచానికి వివరించగల సామర్థ్యం నాకు లేదని నేను భావించటం కావచ్చు. బౌద్ధిక స్థాయిలో మాత్రం నేను అహింస యొక్క ఆ పరమ స్వరూపాన్ని పూర్తిగా అవగాహన చేసుకుని గ్రహించిన మాట మాత్రం నిజం కాని అది ఇంకా నా రోమ కూపాల్లో రంగరించుకొని పోలేదు. నా సామర్థ్యానికి ఆధారం మాత్రం ఒక్కటే. ఏ విషయాన్నయినా నేను స్వయంగా నా జీవితంలో మాటి మాటికి పరిశీలన చేసి దాని గుణ దోషాలను తెలిసికోకుండా ఇతరులకు దాన్ని అనుసరించి ఆచరించ వలసిందని చెప్పను. కాబట్టి ఈనాడు నేను మన దేశవాసులకు చేసుకునే మనవి ఏమంటే కేవలం రెండు ప్రయోజనాలను సాధించేందుకు మనం అహింసను చరమ ధర్మంగా స్వీకరించాలి. మొదటిది, విభిన్న జాతుల మధ్య పరస్పర సంబంధాలను నియమించుకునేందుకూ, రెండవది, స్వరాజ్యం సంపాదించుకునేందుకూ. హిందువులూ, ముసల్మానులూ, క్రైస్తవులూ, సిక్కులూ, పారసీకులూ తమ తమ అభిప్రాయ భేదాలను సమాధాన పెట్టుకునేందుకు హింసను సాధనగా చేసుకోకూడదు. అలాగే మనం స్వరాజ్యాన్ని అహింసాత్మక పద్ధతిలో సాధించాలి. దీనిని భారత దేశం ముందు బలహీనుల ఆయుధంగా కాక బలవంతుల ఆయుధంగా ఉంచేందుకు సాహసిస్తున్నాను. మత విషయంలో బల ప్రయోగం పనికి రాదని హిందువులూ, ముసల్మానులూ ఉభయులూ చాలా గొప్ప గొప్ప మాటలు చెప్తారు. కాని ఎవరైనా హిందువు ఒక ఆవు ప్రాణం రక్షించేందుకు ముసల్మాను ప్రాణం తీస్తే దీన్ని బల ప్రయోగం కాక మరేమంటాం? ఇది ముసల్మానును బలవంతంగా హిందూ మతంలోనికి లాగినట్లే అవుతుంది. అలాగే ఒక మహమ్మదీయుడు మసీదు ఎదురుగా హిందువుల సంకీర్తనను బల పూర్వకంగా ఆపేందుకు ప్రయత్నిస్తే అదికూడా బలప్రయోగం కాక మరేమవుతుంది? ఎంత అలజడి అవుతున్నా మనిషి పరమాత్మ చింతనలో లీనమై ఉండగలగటమే

నిజమైన గొప్పదనం. ఇతరుల దృష్టిని మన మత విశ్వాసాలవైపు ఆకర్షించేందుకు బలప్రయోగం చేయసాగితే ముందు తరాల వాళ్ళు మనల్ని అధార్మికులనీ, అడవి మృగాలనీ అంటారు. మరి 30 కోట్ల జన సంఖ్య గల రాష్ట్రం కేవలం ఒక లక్ష ఆంగ్లేయులకు సద్బుద్ధి కలుగ చేసేందుకు హింసకు పాల్పడటం సిగ్గు చేటవుతుంది. వాళ్ళ హృదయం మార్చేందుకు లేక అవసరమైతే వాళ్ళను దేశం నుండి బయటికి పంపేందుకు మనకు కావలసింది శస్త్ర బలం కాదు, మనో బలం. మనకు మనో బలమే లేకుంటే శస్త్ర బలాన్ని కూడా మనం సమకూర్చుకోలేకపోతాం. మనో బలం కనుక మనకు లభిస్తే శస్త్ర బలం మనకు అవసరమే ఉండదు.

కాబట్టి పైరెండు ప్రయోజనాలను సాధించేందుకు అహింసా ధర్మాన్ని అవలంబించటం జాతి గౌరవానికి చాలా అవసరం, అతి సహజం అయిన నైసర్గిక నిబంధనం. ఆ విధంగా మనం మన సంఘంలో ఉన్న సామూహిక దేహ బలాన్ని ఇంతకంటే మంచి పనులకు ఉపయోగపెట్టుకోటం నేర్చుకోగలుగుతాం. ఈనాడు మనం ఈ బలాన్ని ఇద్దరు సోదరుల మధ్య అర్థం లేని కలహాలతో దుర్వినియోగం చేస్తున్నాం. చివరకు రెండు తెగలూ విచ్ఛిన్నమవుతున్నాయి. అంతే కాక సమగ్ర జాతి సమర్థన మనకు లభించే వరకూ శస్త్ర విద్రోహం ఉన్మత్త ప్రలాపం అవుతుంది. జాతి సమస్తం మనతో కలిసి ఉంటే సహకార నిరాకర ణోద్యమంలో ఏ అంశమైనా సరే ఒక్క నెత్తురు బొట్టు కార్చ కుండా మనం మన ప్రయోజనాన్ని సాధించుకో గలుగుతాం.



34

# మతం మార్పిడికి అనుమతి లేదు

విదేశ వార్తా పత్రికల నుంచి ఏర్చి కూర్చిన కాగితాలలో కనిపించే అనేక శుభ వార్తల్లో ఒకటి కుమారి స్లేక్‌ను గురించి ఉంది. ఆశ్రమంలో మీరాబాయి అని పిలవబడే ఆమె హిందూ మతంలో చేరిందట. ఆమె అలా చేయలేదని నేను చెప్పదలచుకున్నాను. నాలుగు సంవత్సరాల క్రితం ఆమె ఆశ్రమానికి వచ్చినప్పటి కంటే ఈనాటికి చాలా పరినిష్ఠితమైన క్రైస్తవాంగనగా రూపొందిందని నేను ఆశిస్తాను. ఆమె పిన్న వయసులో ఉన్న బాలిక ఏమీ కాదు. ముప్పై సంవత్సరాలు మించిన వయస్సులో ఆమె ఒంటరిగా ఈజిప్టు, పర్షియా, యూరప్‌లలో తిరిగి అక్కడి చెట్లూ చేమలతో, పశుపక్ష్యాదులతో పరిచయం సంపా దించుకుంది. పిన్న వయసులో ఉన్న బాల బాలికలు ముసల్మానులు, పారసీకులు, క్రైస్తవులు చాలా మందిని నేను నాదగ్గర ఉంచుకొని పెంచాను. అది నా అదృష్టం. వాళ్ళను హిందూ మతంలో చేరమని నేను ఎప్పుడూ చెప్పలేదు. వాళ్ళ వాళ్ళ మతగ్రంథాలను చదివి వాటి పట్ల ఆదరాభిమానాలను పెంచుకొమ్మని చెప్పటమే జరిగింది. అలాగే వాళ్ళను ప్రోత్సహించి ప్రేరేపించాను. ఈనాటికి కూడా అలాంటి స్త్రీ పురుషులను, బాల బాలికలను ఎంతమందినో తమ తమ మతాలను ఇతోధిక మమకారంతో చూస్తూ వాటిని చక్కగా అర్థం చేసుకునేందుకు ప్రయత్నించవలసిందనే బోధిస్తూ ఉన్నాను. దానితో బాటు ఇతర మతాలను కూడా సాను భూతితో గౌరవ భావంతో బోధపరచుకొమ్మని కూడా బోధించాను. అలాంటి వ్యక్తులను ఎందరినో నేను ఉదహరించ గలను. ఇప్పటికి కూడా ఆశ్రమంలో అనేక మతాల ప్రతినిధులు ఉంటున్నారు. శుద్ధి-మతం

---

20.2.1930, పుట 507, ఖండం 42, గాంధీ వాఙ్మయం

మార్పిడి ఏ రూపంలో కూడా జరగటం లేదు. అందుకు అనుమతి కూడా ఇవ్వటం జరగదు. ఈ మతాలన్నీ కూడా సదాశయంతో దైవ ప్రేరణతో ఏర్పడ్డవేనని మా నమ్మకం. కాని అపరిపక్వమైన మేధాశక్తి గల అపరిపూర్ణ వ్యక్తులు వీటిని తప్పుదార్లు పట్టించారు. మిస్ స్లేక్ పేరు హిందూ నామం కాదు. అది భారతీయ నామకరణం. అది కూడా ఆమె కోరికపై, సదుపాయం కోసం పెట్టబడ్డ పేరు.



35

# మత ధాత్రి మన ధరిత్రి

హిందూ మతంలో క్రీస్తుకు స్థానం ఉంది. అవును, ఈ భావంతో నేను త్రికరణ శుద్ధిగా ఏకీభవిస్తూ చెప్ప గలను. ఈ మతంలో క్రీస్తుకే కాదు, మహమ్మదుకు, జరధుస్త్రకు, మోసెజ్‌కూ కూడా అదే స్థానం ఉంది. నా దృష్టిలో వేరు వేరు మతాలు ఒక పూల తోటలో పూచే అందమైన పూల వంటివి. ఒక విశాల వృక్షంలో విస్తరించే వేరు వేరు శాఖల్లాంటివి. అందు వల్ల అవి అన్నీ ఒక సర్వ సామాన్యమైన సత్యాన్నే చెప్తాయి. మానవులే వాటిని రూపొందించారు. మానవులే మనకు వాటిని అందించారు. వాటిని వ్యాఖ్యానించింది కూడా మానవులే. కాబట్టి వాటిలో కనిపించే అపరిపూర్ణత కూడా మానవత్వంలోని అపూర్ణతలాంటిదే. భారత దేశంలోనూ, ఇంకా కొన్ని చోట్ల కూడా జరుగుతున్న మతం మార్పిడిని నేను ఏమాత్రం సమర్థించలేను. ఇది గొప్ప తప్పు. ప్రపంచాన్ని శాంతి మార్గంలో తీసుకొని పోయేందుకు ఇది గొప్ప అంతరాయం అవుతుంది. 'పరస్పర మత కలహం' అనే పద ప్రయోగమే దారుణమైన మత నింద అవుతుంది. కాని మత ధాత్రిగా భావింపబడే భారత దేశంలో ఈనాడు మత పరిస్థితి చూస్తుంటే ఈ పదజాలమే మన స్థితి గతులను నిరూపించేందుకు సరియైన అభివ్యక్తి అనిపిస్తున్నది. మన దేశం నిజంగా మతాలకు మాత అయితే ఈ నాడు ఆమె మాతృత్వానికే ఒక సవాలు ఎదురయింది. క్రైస్తవుడైన వ్యక్తి ఎవరైనా హిందువుని క్రైస్తవునిగా మార్చాలని ఎందుకనుకోవాలి? అలాగే హిందువు క్రైస్తవుణ్ణి తన మతంలోకి చేర్చుకోవాలని ఎందుకనుకోవాలి? హిందువు నిజంగా హిందువై ఈశ్వర పరాయణుడై ఉంటే తన మతంతో

---

30.1.1937, పుట 364, ఖండం 64, గాంధీ వాఙ్మయం

తాను తృప్తి పడి ఎందుకుండకూడదు? మనిషిలో శీలం, నీతి లాంటి ఆదర్శాల పట్ల గౌరవం లేకపోతే ఏ చర్చిలోనో, మసీదులోనో, ఆలయంలోనో కూర్చుని ఏదో ఒక పద్ధతిననుసరించి పూజలు, పునస్కారాలు చేయటం కేవలం శుష్క మిథ్యాచారం కాక మరేమవుతుంది? నిజం చెప్పాలంటే ఇలాంటి ఆరాధన వ్యక్తిగతంగా కానీ సామాజికంగా కానీ, వికాసానికి అవరోధమే అవుతుంది. ఒక ప్రత్యేకమైన పూజా విధానాన్ని పట్టుకొని అదే అన్నిటికన్న మిన్న అని మాటి మాటికీ తన మత వైశిష్ట్యాన్ని గురించి తీవ్రంగా వాదించినందు వల్ల అనవసరమైన కలహాలు చెలరేగుతాయి. అవి కాలక్రమంగా భయంకర రక్త పాతానికి దారి తీయవచ్చు. చివరకు భగవంతుడి మీద నమ్మకమే ప్రజల్లో అంతరించిపోవచ్చు.



36

# సి.యఫ్. ఆండ్రూస్ తో చర్చ

ఆండ్రూస్: ఎవరైనా చాలా గంభీరంగా ఆలోచించి ప్రభువును ధ్యానించిన తర్వాత క్రైస్తవుణ్ణి కాకుంటే నాకు శాంతి మోక్షాలు లభించవని చెప్తే మీరేమంటారు?

గాంధీ: ఒకవేళ క్రైస్తవుడు కాని వ్యక్తి-హిందువే అనుకోండి-ఒక క్రైస్తవుడి దగ్గరకు వెళ్ళి ఈ మాట అంటే అతనికి తన మతం మార్చుకోవటం వల్ల ఏమీ లాభం లేదనీ, అంతకంటే మరింత మంచి హిందువుగా మారటంలోనే శ్రేయస్సు ఉందనీ సలహా చెప్పాలనీ నేనంటాను.

ఆండ్రూస్: ఈ విషయంలో నేను మీతో పూర్తిగా ఏకీభవించలేను. మీకు నా సంగతి బాగా తెలుసు. క్రీస్తును ఆశ్రయించందే ముక్తి లభించదనే నమ్మకాన్ని నేను ఎన్నడో వదిలాను. కాని, ఆక్స్ఫర్డ్ గ్రూప్ మూవ్‌మెంటు సదస్సుడెవరైనా మీ కుమారుడి జీవితాన్ని మార్చివేశాడనుకోండి. అప్పుడు మీ కుమారుడు తాను క్రైస్తవుడిగా మారటమే మంచిదని భావిస్తాడనుకోండి అప్పుడు మీరేమంటారు?

గాంధీ: ఆక్స్ఫర్డ్ గ్రూప్ ఎంతమంది జీవితాలు మార్చినా మార్చవచ్చు. కాని ఎవరి మతాన్ని కూడా మార్చకూడదనే నేనంటాను. ఎవరి మతంలో ఉన్న ఉన్నత ఆదర్శాలమీద ఆ మతాల వారి ఆసక్తిని పెంచి వాటిననుసరించి తమ జీవితాలను చక్కదిద్దుకోమని చెప్పాలి. ఒక రోజు ఒక వ్యక్తి నా దగ్గరకు వచ్చారు. ఆయన తల్లిదండ్రులు బ్రాహ్మణులు. మీ (ఆండ్రూస్) పుస్తకం చదివిన తర్వాత అతనికి క్రైస్తవ మతంలో చేరాలని అనిపించిందట. మీ పూర్వీకుల మతంలో మీకేమయినా

28.11.1936, పుటలు 21-24, ఖండం 64, గాంధీ వాఙ్మయం

లోపం కనిపించిందా అని నేనతన్ని అడిగాను. 'లేద'న్నారాయన. మరి బైబిలును ప్రపంచంలోని ఉత్తమ మత గ్రంథాలలో ఒకటిగానూ, క్రీస్తును గొప్ప మత గురువులలో ఒకరు గానూ భావించటంలో మీకేమయినా ఇబ్బందా? అని ప్రశ్నించాను. మీరు (ఆండ్రూస్) మీ పుస్తకాలలో ఎక్కడా కూడా భారతీయులను బైబిలు నమ్మి క్రీస్తును అనుసరించాలని చెప్పలేదే అని అతనితో అన్నాను. మీరు మాత్రం నమ్మకం గల ముసల్మాను, జీవితంలో ఎంత చెడిపోయినా, ఎంత మంచి హిందువుకంటే కూడా గొప్పవాడని బోధించే కీ.శే. మహమ్మద్ ఆలీ లాంటి వారు కాదనుకుంటాను.

ఆండ్రూస్: మహమ్మద్ ఆలీతో నేను ఏ మాత్రం ఏకీభవించను. కాని ఎవరైనా తమ మతం మార్చుకోవాలని నిజంగా నిర్ణయించుకుంటే అతని దారికి అడ్డుగా రావడం భావ్యం కాదని మాత్రం నేను గట్టిగా చెప్తాను.

గాంధీ: కాని మీరా వ్యక్తికి తన నిర్ణయాన్ని గురించి మరోసారి ఆలోచించుకునేందుకు అవకాశం ఇవ్వటం లేదు. అతన్ని ప్రశ్నించి అతని ప్రత్యుత్తరాలను వినటం కూడా మీరు చేయటం లేదు. ఎవరైనా క్రైస్తవుడు నా దగ్గరకు వచ్చి తాను భాగవతం చదివి చాలా ముగ్ధుణ్ణయి పోయాననీ, అందు వల్ల హిందువు కావాలనుకుంటున్నాననీ అన్నాడనుకోండి, అలాంటప్పుడు: "కాదు, నాయనా, అలా కాదు. భాగవతంలో ఉన్న మంచి, బైబిల్‌లో కూడా ఉంది. కాని నీవు ఇంత వరకూ ఆ గ్రంథంలో ఈ మంచిని కనిపెట్టేందుకు ప్రయత్నించలేదు. ప్రయత్నించి మంచి క్రైస్తవుడవు కా." అని నేనతనికి చెప్తాను.

ఆండ్రూస్: మీరు చెప్పిన దానిపై నేనేమీ అభిప్రాయం ఇవ్వలేను. కాని నా దగ్గరకు ఎవరైనా వచ్చి 'నేను మంచి క్రైస్తవుణ్ణి కావాలనుకుంటున్నా'నని అంటే అలాగే కమ్మని నేను అంటాను. మతం మార్చుకోవాలనే తీవ్ర సంకల్పంతో నా దగ్గరకు ఎంతమందో వచ్చారు. అలాంటి వాళ్ళను కూడా నేను తిరిగి పంపించిన విషయం మీకు తెలుసు. నేను వాళ్ళకు చెప్పాను. 'బాబూ మీరు అలా మారేందుకు నేను కారణభూతుణ్ణి మాత్రం కాను.' మానవ నైజం మనస్సును ఆకట్టుకునే మతం కోసం ఎదురు చూస్తూ ఉంటుంది.

గాంధీ: బైబిల్‌ను నమ్మితే నమ్మవచ్చు. కాని అంత మాత్రాన మతం మార్చుకోవాల్సిన అవసరం ఏముంది? మత ప్రచారం చేసే ఈ పద్ధతి వల్ల ప్రపంచంలో శాంతి వర్ధిల్లదు. మతం చాలా వ్యక్తిగతమైన

విషయం. మనం స్వబుద్ధిని ఉపయోగించుకొని మనకు నచ్చిన జీవిత విధానాన్ని అవలంబిస్తూ అన్ని మతాలలోని మంచినీ పంచుకుంటూ భగవంతుని సన్నిధిని చేరే ప్రయత్నం నెరవేరేటట్లు ఎవరికి తోచిన సహకారం వాళ్ళు చెయ్యాలి.

ఆలోచించి చూడండి. అన్ని మతాల వాళ్ళూ సహన భావంతో ఇతర మతాలను గౌరవించటం మేలా లేక అన్ని మతాలనూ సమాన ప్రతిపత్తితో చూడటం శ్రేయస్కరమా? నా మట్టుకు నేను ప్రపంచంలోని మతాలన్నీ తాత్వికంగా సమానమే అని భావిస్తాను. మనం మన మతాన్ని ఎలా గౌరవిస్తామో ఇతర మతాలను కూడా అలాగే సహజమైన సద్భావంతో గౌరవించాలి. పారస్పరిక సహనం కాదు,సమాన గౌరవం అవసరమని గమనించాలి.



37

# సర్వ ధర్మ సమన్వయం

ఈ రోజుల్లో మన క్రైస్తవ మిత్రులు బయటకు స్పష్టంగా చెప్పకపోయినా, తమ భావాలు ఇలాంటివని బాహటంగా ఒప్పుకోకపోయినా వాళ్ళ అంతఃకరణంలో మాత్రం హిందూ మతం అసంబద్ధమైన మతమనీ, క్రైస్తవ మతం-వాళ్ళకు అర్థమైనంత వరకూ, అర్థం చేసుకున్న పద్ధతిలో-నిజాయితీ గల ఏకైక మతమనీ దృఢంగా నమ్ముతారు. కొన్నాళ్ళ క్రితం 'హరిజన్' లో ఉదహరించిన సి.యం.యస్. అప్పీలులో వివరించిన విషయాలను పరిశీలిస్తే వాళ్ళ ఈ మనో వృత్తి స్పష్టంగా తెలుస్తుంది. ఈ అప్పీలు వెనుక పని చేస్తున్న ఈ మనో వృత్తిని అంగీకరించకపోతే దాన్ని గౌరవించటం మాట అలా ఉంచి దాన్ని అర్థం చేసుకోవటం కూడా సాధ్యం కాదు. హిందూ సమాజంలో ప్రవేశించిన అంటరానితనం లాంటి పొరబాట్లను నిరసించటం మనం అర్థం చేసుకోగలం. కాని, ఈ దురాచారాలను తొలగించి మన మతాన్ని పరిష్కరించుకునేందుకు వాళ్ళు మనకు సాయం చేయగలిగితే అది నిర్మాణాత్మకమైన సహకారం అవుతుంది. అది చాలా అవసరం అవుతుంది. అలాంటి పని చేసినందుకు మనం కృతజ్ఞత చెప్పుకుంటాం. కాని ఈ నాడు జరుగుతున్న ప్రయత్నం హిందూ మతాన్ని కూకటి వేళ్ళతో పెకలించి వేసి దాని స్థానంలో ఇతర మతాలను స్థాపించేందుకు పునాదులు వేస్తున్నది. ఇది ఎలా ఉంటుందంటే, ఏదయినా ఒక భవనం పాత పడిపోయి మరమ్మత్తు చేయాల్సి వస్తే అందులో నివసించే వాళ్ళకు అది ఉపయోగ పడుతున్నప్పటికీ దాన్ని నేల గూల్చినట్టుంటుంది. ఎవరైనా ఆ ఇంటి యజమాని దగ్గరకు వెళ్ళి 'అయ్యా! ఇందులో ఈ మార్పులు, కూర్పులూ

---

13.3.1937, పుటలు 485-486, ఖండం 64, గాంధీ వాఙ్మయం

చెయ్యాలని చెప్తే ఆయన వెంటనే అలాంటి సలహాలకు కృతజ్ఞత చెప్పుకుంటాడు. అలా కాక ఆ ఇంటినే పడగొట్టసాగితే తరతరాలనుంచీ పూర్వీకులు నివసిస్తున్న భవనంలో ఉండే యజమాని ఆ చర్యను ప్రతిఘటించటంలో ఆశ్చర్యం లేదు. ఒకవేళ అతనికి తనంతట తనకే ఆ ఇల్లు ఇక నిలబడలేదనే భావం కలిగి దానికి మరమ్మత్తులు చేయటం వ్యర్థమని తోస్తే ఆ పరిస్థితి వేరు. హిందూ మతాన్ని గురించి క్రైస్తవ జగత్తులో ఏర్పడుతున్న భావం ఇలాటిదే కనక అయితే 'సర్వ మత సమావేశం', 'అంతర్జాతీయ విశ్వ బంధుత్వం' లాంటి పద జాలానికి అర్థమే అంతరించి పోతుంది. ఈ రెండు పదాలూ సామరస్యాన్నే సూచిస్తాయి. అందరూ సమాన ప్రతిపత్తితో సమావేశం అయ్యేందుకు ఇవి ప్రాతిపదికను తయారు చేస్తాయి. కొన్ని మతాలు గొప్పవనీ, కొన్ని చిన్నవనీ కొన్నింటికి జ్ఞాన జ్యోతి లభించిందనీ, మరి కొన్నింటికి అది లేదనీ కొన్ని పరిష్కృతమైనవనీ, మరికొన్ని అపరిష్కృతమైనవనీ కొన్నింటికి అభిజాత్యం ఉన్నదనీ, కొన్నింటికి లేదనీ కొన్నింటిలో కొన్ని కులాలు చేరాయనీ, మరి కొన్ని కులాలకు స్థానం లేదనీ-అనే సంకీర్ణ భావాలు ఉన్నప్పుడు అందరకూ అనువైన ఆచార వేదిక లభించటం కష్టం. నేను చేసిన పోలిక లోప భూయిష్ఠం కావచ్చు, అవమాన జనకంగా కూడా తోచవచ్చు. నేను సమర్థిస్తున్న పద్ధతి కూడా సమంజసం కాక పోవచ్చు. కానీ, నేను చెప్పిన దానికి తిరుగు లేదు.



38

# ఆర్. ఆర్. కీథన్ తో సంభాషణ

మతాలన్నీ ధర్మ సమ్మతమైనవే కాక అవన్నీ సరి సమానమైనవి కూడా అని అన్నారు గాంధీజీ. ఆయన చెప్పిన ఈ మాట శ్రీ కీథన్ గారికి బోధ పడటం లేదు. శాస్త్ర దృష్ట్యా అన్ని మతాలూ సమానమని చెప్పటం సరి కాదని వారి అభిప్రాయం. అలా అయితే ప్రకృతిని పూజించే వాళ్ళనూ ఈశ్వరారాధనను చేసే వాళ్ళనూ ప్రజలు పోల్చటం ఆరంభిస్తారు.

వేరు వేరు మతాలను పోల్చి చూడటం వల్ల ప్రయోజనం లేదని కీథన్ గారు అన్నారు. ఏ మతం పద్ధతి దానిది. ఒక వస్తువును వేరు వేరు పరి భాషలతో వ్యాఖ్యానించటం ఎలా సాధ్యమవుతుందని వారి ప్రశ్న. దీనికి గాంధీగారి సమాధానం ఇది:

**గాంధీజీ:** మతాలను తులనాత్మకంగా పరిశీలించి చూడటం సాధ్యం కాదని మీరు చెప్పిన మాట అక్షరాలా నిజం. కాని దాని వల్లనే మనకు మతాలన్నీ సమానమనే సత్యం బోధ పడుతుంది. జన్మతః అందరూ స్వతంత్రులే, సమానులే. కాని, మనలో కొందరు శారీరకంగా, మానసికంగా బలిష్ఠులుగా కనిపిస్తారు. మరి కొందరు బలహీనంగా కనిపిస్తారు. కాబట్టి స్థూలంగా చూస్తే ఇద్దరిలో ఏమీ సామ్యం లేదు. కాని తాత్త్వికంగా చూస్తే ఒక విధమైన సమానత్వం గోచరిస్తుంది. ఆవరణను తొలగించి నగ్న రూపంలో చూస్తే మనమందరం సమానులమే. భగవంతుడు నన్ను గాంధీగానూ, మిమ్మల్ని కీథన్‌గానూ చూడటం లేదు కదా! ఈ విరాట్ విశ్వంలో మన ఉనికి ఎంత పాటిది? పరమాణువుల కంటే మనం అల్పులం. పరమాణువులను చూచి వాటిలో ఏది చిన్నది,

---

13.3.1937, పుటలు 462-463, ఖండం 64, గాంధీ వాఙ్మయం

ఏది పెద్దది అని ప్రశ్నించటం ఎంత నిరర్థకమో మనలో కూడా చిన్న పెద్దలను ఎన్నటం అంత హాస్యాస్పదం. తాత్త్వికంగా అందరూ సమానులే. కులం, వర్ణం, బలం, బుద్ధి, వాతావరణం, రాష్ట్రం-ఈ భేదభావాలన్నీ క్షణ భంగురాలు. అలాగే అన్ని మతాలూ తాత్త్వికంగా సమానమే. మీరు 'కురాను' చదవాలనుకుంటే ముసల్మానుల దృష్టితో చదవాలి. 'బైబిల్' క్రైస్తవ దృక్పథంతోనే చదవాలి. 'గీత' చదివేటప్పుడు హిందూ నయనాలతో అధ్యయనం చేయాలి. వితండ వాదాలకు దిగి ఇతర మతాలను ఎగతాళి చేసినందు వల్ల లాభం లేదు. మీరు 'జీనెసిస్' లేదా 'మ్యాథ్యూ' చూడండి. అందులో ఒక విశాల మైన వంశ వృక్షం కనిపిస్తుంది. చివరకు క్రీస్తు ఒక కన్యకు జన్మించినట్లు చెప్పబడింది. ఇక్కడ ఒక చీకటి గోడ మనకు ఎదురవుతుంది. అంతా అయోమయంగా తోస్తుంది. కాని ఇదంతా ఒక క్రైస్తవ దృక్పథంతో చదివి అర్థం చేసుకోవాలి.

**కీథన్:** అయితే మా బైబిల్‌లో మూసా-ఏసు ప్రసక్తి కూడా ఉంది కదా. మరి ఇద్దరినీ మనం సమాన దృష్టితోనే చూడాలా?

**గాంధీజీ:** అవును. ఎందుకంటే ప్రవక్తలందరూ సమానులే. ఇది పూర్తిగా ఒక సమతల భూమి.

**కీథన్:** ఐన్‌స్టీన్ సాపేక్ష వాదం దృష్ట్యా అందరూ సమానులే. కాని ఈ సమానత్వాన్ని నేను సరిగా వ్యక్త పరచలేను. దానిని సరియైన పద్ధతిలో నిర్వచించలేను.

**గాంధీజీ:** అందుకనే నేనంటాను-అన్ని మతాలు సమానమేనని, వాటిలో లోపాలు కూడా సరి సమానంగా కనిపిస్తాయని. మీరు ఎంత సూక్ష్మంగా రేఖను నిర్మించగలిగితే అది యూక్లిక్ సరళ రేఖకు అంత సమీపం అవుతుంది. కాని అది ఆదర్శ సరళ రేఖ మాత్రం కాలేదు. మతం ఒక బృహద్ వృక్షం. దాని శాఖలు కొన్ని పెద్దవి, కొన్ని చిన్నవి. స్థూలంగా చూస్తే అవి సమానం కావు. అవి పెరుగుతూ ఉంటాయి. అన్నిటి కంటే పెద్ద కొమ్మ పై కూర్చున్న వ్యక్తి తాను చాలా పెద్ద కొమ్మ మీద కూర్చున్నానని గొప్ప చెప్పుకోకూడదు. ఎవరూ ఎవరికంటే శ్రేష్ఠులుకారు, క్షుద్రులు గారు.



39

# అహమదాబాదు దళిత వర్గ సమ్మేళనంలో చేసిన ప్రసంగం

నేను సర్వదా సనాతన హిందూ మతావలంబిననే చెప్పుకున్నాను. హిందూ మతానికి సంబంధించిన శాస్త్ర పరిజ్ఞానం నాకు బొత్తిగా లేకపోలేదు. సంస్కృతంలో నాకు ఎక్కువ పాండిత్యం కూడా లేదు. వేదాలనూ, ఉపనిషత్తులనూ నేను అనువాదాల ద్వారానే చదివాను. అందువల్ల బహుశా ఈ గ్రంధాలను పాండిత్య ధోరణిలో నేను అధ్యయనం చేయలేదు. వాటిని గురించిన నా జ్ఞానం గహనమైనదని నేను చెప్పలేను. కాని సామాన్య హిందువు ఎంత నిశితంగా ఈ గ్రంధాలను అధ్యయనం చేయాలో అలా నేను కూడా చేసానని మాత్రం చెప్పగలను. వాటిలోని అంతర్యాన్ని నేను గ్రహించ గలిగానని కూడా నేను ధైర్యంగా చెప్ప గలను. నా వయస్సు 21 సంవత్సరాలు దాటే సరికి ఇతర మతాల గ్రంధాలను కూడా నేను అధ్యయనం చేసాను.

ఒకానొక సమయంలో హిందూ మతం, క్రైస్తవ మతం మధ్య నేను డోలాయమానంగా ఊగుతూ ఉండే వాణ్ణి. కాని, నాకు సంతులిత మనస్సు ఏర్పడే సరికి హిందూ మతంలోనే నిలకడ సాధించుకోవటంలోనే నాకు మోక్షం ఉందని నాకు తోచింది. అప్పటి నుంచి హిందూ మతానికి సంబంధించిన నా జ్ఞానం పటిష్ఠం కాసాగింది. అందులో నా శ్రద్ధ నానాటికీ హెచ్చింది.

కానీ ఆ రోజుల్లో అంటరాని తనం హిందూ మతంలో ఒక భాగం అని నాకు నమ్మకం ఉండేది. అదే నిజమైతే అలాంటి హిందూ మతం

---

27.4.1921, పుట 578, ఖండం 19, గాంధీ వాఙ్మయం

నాకేమి ఉపయోగిస్తుంది? అని అనుకునే వాణ్ణి.

హిందూ మతంలో అంటరానితనం పాపమని భావింపబడదన్న మాట నిజం. శాస్త్రార్థాలకు సంబంధించిన వాద వివాదాలలో చిక్కుకు పోవటం నాకు ఇష్టం లేదు. 'భాగవతం', 'మనుస్మృతి' లాంటి గ్రంథాల నుండి శ్లోకాలను ఉటంకించి నా వాదాన్ని సమర్థించుకోవటం నాకు కష్ట సాధ్యమే కావచ్చు. కాని హిందూ మత తత్త్వాన్ని నేను అవగాహన చేసికో గలిగానని మాత్రం నేను గట్టిగా చెప్పుకోగలను. అంటరాని తనాన్ని అనుమోదించి హిందూ మతం పాపం చేసింది. ఇందు వల్ల మనం పతనం పొందాం. సామ్రాజ్య దృష్టిలో మనం శూద్రుల్లా దిగ జారిపోయాం. మన ద్వారా ఈ అంటు వ్యాధి ముసల్మానులకు కూడా సంక్రమించింది. దక్షిణ ఆఫ్రికా, ప్రాచ్య ఆఫ్రికా, కెనడాలో హిందువుల్లాగా వాళ్ళు కూడా శూద్రులుగా పరిగణింపబడ సాగారు. ఈ దోషాలన్నీ అంటరానితనం అనే పాపం వల్ల ప్రాప్తించినవే.



## 40

# అస్పృశ్యతా పాపం

మతంలో అస్పృశ్యతకు సంబంధించిన ప్రసక్తి లేదు. ఇది అసురుల మాయా జాలం. రాక్షసులు ఎప్పుడూ శాస్త్రాలను ఏకరువు పెడుతూ ఉంటారు. కాని శాస్త్రం సత్యానికీ, వివేకానికీ అతీతమయింది కాదు. వివేకాన్ని నిర్మలం చేసి సత్యాన్ని వెలుగులోకి తీసికుని వచ్చేందుకే శాస్త్ర రచన జరిగింది. వేదాలు పశు బలిని అనుమతించి, సహించి, శాసించినంత మాత్రాన నిరపరాధి అయిన గుర్రాన్ని నిలువునా దహించలేను. వేదాలు నా దృష్టిలో దివ్య రచనలు, అపౌరుషేయాలు. బైబిలులో చెప్పినట్లు పొడి పొడి మాటలు మారక హేతువులు కావచ్చు; కాని మాటల్లో ఇమిడి ఉన్న మర్మం పరంజ్యోతిని ప్రసాదించ గలదు. వేదాలలోని పరమార్థం పవిత్రతను, సత్యనిష్ఠను, నిర్దుష్టతను, సౌశీల్యాన్ని, వినయాన్ని, సౌజన్యాన్ని, క్షమను, దివ్యతను బోధిస్తుంది. స్త్రీ పురుషులకు ఔదార్యాన్ని, ధైర్యాన్ని ప్రసాదించేదే వేదం. నోరు విప్పకుండా జన మాలిన్యాన్ని మోసే నీరవ సేవా పరాయణులను కుక్కలకంటే హీనంగా చూచి వాళ్ళను చూచి అసహ్యించుకుని ఉమియటంలో ఔదార్యమూ లేదు, ధైర్యమూ లేదు.

---

19.1.1921, పుటలు 248-249, ఖండం 19, గాంధీ వాఙ్మయం



# 41

## అకోలాలో అంటరానితనంపై చేసిన ప్రసంగం

అంటరానితనా'న్ని గురించిన నా అభిప్రాయాలు నాకు పాశ్చాత్య విద్య వల్ల లభించినవి కావు. ఇంగ్లాండు వెళ్ళేందుకు చాలా రోజుల పూర్వం, శాస్త్రాధ్యయనం చేసేందుకు కూడా ముందు, ఇలాంటి ఆలోచనలకు అనుకూలం కాని వాతావరణంలోనే ఈ భావాలు ఏర్పడ్డాయి. పూర్వాచార పరాయణులైన వైష్ణవ కుటుంబంలో నేను జన్మించాను. అయినా వయస్సు వచ్చినప్పటినుంచే నా ఆలోచనలు ఈ విషయంలో బలిష్ఠమయ్యాయి. ఆ తర్వాత హిందూ మతానికి సంబంధించిన గ్రంథాలను తులనాత్మకంగా పరిశీలించటంతో నా ఆలోచనలకు మరింత పుష్టి చేకూరింది. మన శాస్త్రాలలో పంచముల గురించి ప్రస్తావనే లేదు. 'గీత'లో బ్రాహ్మణుణ్ణి, చండాలుణ్ణి సమ దృష్టితో చూడాలని శాసించబడింది. అయినా మనం హిందూ మతం నొసట కలంకంగా తాండవం చేస్తున్న యీ దురాచారాన్ని ఎందుకు పట్టుకు ఊరేగుతున్నామో నాకు తెలియదు. పాకీవాణ్ణి, బ్రాహ్మణుణ్ణి ఒకే విధంగా చూచుకోవాలంటే బ్రాహ్మణుల పట్ల చూప వలసిన శ్రద్ధ చూపించ వలసిన అవసరం లేదని కాదు. పాకీవాడికి కూడా సంఘంలో బ్రాహ్మణులకు లభించిన వసతులు, మర్యాద లభించాలని దాని అర్థం. పాఠశాలలకు వాళ్ళ పిల్లలు కూడా వెళ్ళి చదువుకో గలగాలి. బావుల్లో నీరు తోడుకునే అధికారం అందరిలాగా వాళ్ళకు కూడా ఉండాలి. దేవాలయాల్లోకి వెళ్ళి అందరు హిందువుల్లాగానే దైవ దర్శనం చేసుకునే అవకాశం ఉండాలి.

---

7.2.1927, పుటలు 54-55, ఖండం 33, గాంధీ వాఙ్మయం



42

# సహస్ర శిర దానవుడు

స్పర్శ దోషం, దృష్టి దోషం వేద కాలం నుంచీ వస్తున్న ఆచారమని మీరు భావిస్తారా?

ఈ విషయాన్ని గురించి ప్రామాణికంగా చెప్పగలిగేంత వేద పరిజ్ఞానం నాకు లేదు. వేదాలు పవిత్ర గ్రంథాలని నాకు పూర్తిగా నమ్మకం ఉంది. స్పర్శ దోషాన్ని గురించి కాని, దృష్టి దోషాన్ని గురించి కాని, వేదాలలో ఏమీ ప్రసక్తి లేదని చెప్పేందుకు నేనేమీ వెనుదీయవలసిన అవసరం లేదని భావిస్తాను. కాని ఈ విషయంలో నాకంటే శ్రీ సి.వి.వైద్య, పండిత సాత్‌వలేకర్ గార్లు అధికారికంగా చెప్ప గలరు. కాని నీతి విరుద్ధమైన ఆచారం వేదకాలంనుంచీ ప్రచారంలో ఉన్నప్పటికీ, అది అన్ని విధాలా త్యజించవలసిందేనని మాత్రం చెప్పటం నా అభిమతం. ఈ ఆచారం వేద విజ్ఞానానికి విరుద్ధమైనదే కాక అన్నింటికీ మూలాధారమైన నీతి శాస్త్రానికే ఇది విరుద్ధమైనది.

తర్వాతి నాలుగు ప్రశ్నలను సంగ్రహంగా ఇలా చెప్పవచ్చు.

కర్మ కాండ ఆకర్షణ శక్తికి సంబంధించిన విషయాలపై ఆధార పడి ఉంటుందనీ, స్పర్శ-దృష్టి దోషాలు, జాతాశౌచం, మృతాశౌచం మనశ్శుద్ధి కోసం ఏర్పాటయినవనీ మీరు నమ్మరా?

ఇలాంటి ఆచారాలను గురించి చెప్పాలంటే వాటికి ఏదో ఒక ఆధారం, ప్రయోజనం ఉండనే ఉంటుందని చెప్పాల్సి ఉంటుంది. కానీ వేదాల్లో, ఉపనిషత్తుల్లో, పురాణాల్లో, తదితర శాస్త్రాలలోనే కాక ప్రపంచంలోని మత గ్రంథాల్లో చిత్త శుద్ధి, అభ్యంతర ప్రక్రియ అని స్పష్టంగా చెప్పబడి ఉంది. శారీరిక కార్య కలాపాల వల్ల ఉత్పన్నమయ్యే ఆకర్షణ శక్తి

---

3.10.1929, పుటలు 542-543, ఖండం 41, గాంధీ వాఙ్మయం

మనస్సు-మనస్సు మధ్య ఏర్పడే ప్రభావ పరిణామంగా ఉత్పన్నమయ్యే సూక్ష్మాకర్షణ శక్తికి పోల్చి చూస్తే అది అత్యల్పం. బాహ్య శుద్ధికోసం చేసే కర్మ కాండ వల్ల వ్యక్తిలో అహంకారం ప్రబలి తన తోటి వారికంటే తాను చాలా గొప్పవాడనే భావం కలిగి, ఇతరులను పశుతుల్యులుగానూ అంతకంటే కూడా నీచంగా చూస్తే అలాంటి కర్మ కాండ ఆత్మ ఘాతకం అవుతుంది.

కాబట్టి విధి-నిషేధాలు వివేక సమ్మతంగా ఉండాలి. వాటివల్ల ఆత్మ హననం కాకూడదు. అస్పృశ్యతకు సంబంధించిన నియమాలు ఆత్మ వికాసానికి అవరోధాలని రుజువయ్యింది. అలా వాటిని రుజువు చెయ్యవచ్చు. ఇలాంటి నియమాలు హిందూ మతం యొక్క ఉదాత్తమైన ఆశయాలకు విరుద్ధమైనవి అవుతాయి.



43

# డాక్టర్ బాబా సాహెబ్ అంబేద్కర్ చేసిన నేరారోపణ

గత మే నెలలో కుల నిర్మూలక మండలి వార్షిక సమావేశం లాహోరులో ఏర్పాటు చేసారు. దానికి డాక్టర్ అంబేద్కర్ అధ్యక్షత వహించ వలసింది. కాని డాక్టర్ అంబేద్కర్ ఇందుకోసం తయారు చేసి ఉంచిన ఉపన్యాస పాఠం ఆహ్వాన సంఘానికి ఆమోదనీయం కాకపోవటం వల్ల ఆ సమావేశం జరుగ లేదనే విషయం పాఠకులకు గుర్తుంటుంది.

డాక్టర్ అంబేద్కర్ ఆహ్వాన సంఘంతో అంత సులువుగా ఓడిపోయే వ్యక్తి కారు. సంఘం అంగీకరించకపోయినా ఆ ఉపన్యాస పాఠాన్ని తన ఖర్చుమీద వారు ప్రచురించారు. దాని వెల ఎనిమిది అణాలు పెట్టారు. కాని దాని వెలను ఏ రెండు అణాలో లేకుంటే మహా అయితే ఒక పావలా పెట్టివుంటే బాగుండేదని నేను వారికి చెప్తాను.

ఈ ఉపన్యాసంలో చెప్పిన విషయాలను ఏ సంస్కర్త కూడా ఉపేక్షించలేడు. పూర్వాచార పరాయణులకు కూడా ఇందులో తెలుసుకోవలసిన విషయాలు చాలా ఉన్నాయి. కాని అంత మాత్రాన ఇందులో అభ్యంతరకరమైన విషయాలు ఏమీ లేవని మాత్రం అనుకోకూడదు. అందులో అలాంటి విషయాలు గాఢంగా ఉండటం వల్లనే దాన్ని అందరూ చదవాల్సిన అవసరం ఉంది. డాక్టర్ అంబేద్కర్ హిందూ మతానికి ఒక సవాలు. ఆయన హిందూ కుటుంబంలో పెరిగి హిందూ రాజపోషణలో చదువుకున్నా అగ్రజాతికి చెందిన హిందువులనబడే వాళ్లు తన జాతి వాళ్ళకు చూపే నిరాదరణ వల్ల

---

11.7.1936, పుటలు 147-148, 18.7.1936, పుటలు 167-168, ఖండం 63, గాంధీ వాఙ్మయం.

ఆయనలో నైరాశ్యం ఎంతగా ఘనీభవించి పోయిందంటే అగ్రజాతి హిందువులనే కాక హిందూ మతాన్నే పరిత్యజించాలని ఆయన అనుకుంటున్నారు. ఇది తనతోపాటు తోటి హిందువులకు వారసత్వంగా లభించిన సొత్తు. ఆ మతాన్ని అనుసరించే ఒక వర్గం వారి ప్రవర్తనను చూచి ఆయన హిందూమతం పట్లనే నిరాశ చెందారు.

కాని ఇందులో ఆశ్చర్యం లేదు. ఏ ఆచారాన్ని గురించి కాని, సంస్థను గురించి గానీ ఒక అభిప్రాయం ఏర్పడేందుకు ఆ సంస్థల ప్రతినిధుల ప్రవర్తనే ఆధారమవుతుంది. అదీ కాక, అగ్రజాతి హిందువులు అధిక సంఖ్యాకులుగా ఉండి తమ తోటివారిని అంటరాని వారని బహిష్కరించి వారితో నిర్దాక్షిణ్యంగా అమానుషికంగా ప్రవర్తించటమే కాక తమ ప్రవర్తనకు శాస్త్రాలను ఆధారం చేసుకున్నారు. డాక్టర్ అంబేద్కర్ శాస్త్రాలను పరిశీలించి చూస్తే నిజంగా వాటిలో అస్పృశ్యతనుఅన్ని విధాల సమర్థించే ధోరణి కనిపించింది. డాక్టర్ అంబేద్కర్ మూడు నేరాలను ఆరోపించారు: హరిజనుల పట్ల క్రూరంగా ప్రవర్తించటం; ఇలా నిర్దాక్షిణ్యంగా ప్రవర్తించే వాళ్ళు సిగ్గు లేకుండా తమ ప్రవర్తనను సమర్థించటం; హిందూ శాస్త్రాలలో వీటికి ప్రబల సమర్థన లభించటం. ఆయన తన ఆరోపణకు సమర్థనగా శాస్త్రాల లోని అధ్యాయాలు, శ్లోకాలు ఉదహరించారు.

నా ఉద్దేశ్యంలో డాక్టర్ అంబేద్కర్ చేసిన గొప్ప తప్పు ఏమంటే ఆయన ఇచ్చిన ఉదాహరణలు ప్రామాణ్యంలోనూ, ప్రాభవంలోను నిర్వివాదాలు కావు. ఆయన పేర్కొన్న హిందువులు హిందూ మతానికి నిజమైన ప్రతినిధులు కారు. వారు దాదాపు పతనం వైపు పయనిస్తున్న వాళ్ళు. డాక్టర్ అంబేద్కర్ అవలంబించిన కొలబద్దను బట్టి చూస్తే ఈనాడు జీవించి ఉన్న మతం ఏదీ బహుశా దానికి సరి తూగదు.

తన గంభీరోపన్యాసంలో విద్వద్వర్యులు (డాక్టర్ అంబేద్కర్) తన పక్షాన్ని సమర్థించుకునేందుకు అతిశయోక్తిని ఉపయోగించారు. చైతన్య మహా ప్రభువులు, జ్ఞానదేవ్, తుకారాం, తిరువళ్ళువర్, రామకృష్ణ పరమహంస, రాజా రామమోహన్ రాయ్, మహర్షి దేవేంద్రనాధ్ ఠాకూర్, వివేకానంద మొదలయిన వాళ్ళు ఇంకా ఎందరో సహజంగా జ్ఞాపకం వచ్చే మహనీయులు ఏ మతాన్ని ఆచరణలో పెట్టారో, ఆ మతం డాక్టర్ అంబేద్కర్ తన ప్రసంగంలో నిరూపించేందుకు ప్రయత్నించినంత గుణరహితం కావటం సాధ్యమా? ఏ మతం యొక్క ప్రాశస్త్యమైనా ఆ మతంలో ఆవిర్భవించిన మహోన్నత మహనీయులపై ఆధార పడి

ఉంటుంది కాని అందులో కనిపించే నికృష్టులను బట్టి ఆ మతం యొక్క విలువను నిర్ణయించరాదు. ఆ మతంలోని సర్వోత్కృష్టతను ఆదర్శంగా తీసుకుని అంతకు మించి వెళ్ళలేకపోయినా కనీసం ఆ మేరకైనా చేరేందుకు మనస్ఫూర్తిగా ప్రయత్నించాలి.

